# వీక్షణం

ఆర్థిక, సామాజిక మాసపత్రిక

జూన్ 2006 59 రు. 10

▲ ఓ బి సి రిజర్వేషన్లు - సంఘటిత పోరాట అవసరం

▲ 2006 శాసన సభ ఎన్నికలు - ఒక సమీక్ష

▲ సూక్ష్మ రుణ భారతం

▲ ఎ డి బి ఎవరి అభివృద్ధి బ్యాంకు ?

▲ ప్రపంచీకరణ - వ్యవసాయరంగం

# తెలుగు సమాజానికి వెలుగు దివ్వె

**విధానాల విశ్లేషణలు**

ప్రభుత్వ విధానాలు - వాటి పర్యవసానాలపై లోతైన విశ్లేషణలు

**క్షేత్ర నివేదికలు**

వివిధ పథకాల అమలుపై, ప్రజల జీవన స్థితిగతులపై సమగ్ర క్షేత్ర నివేదికలు




**వార్తా విశేషాల కదంబం**

ప్రధాన స్రవంతి పత్రికల్లో అరుదుగా కనిపించే జాతీయ, అంతర్జాతీయ కథనాలు

**అభివృద్ధి చర్చలు**

పోలవరం నుండి యురేనియం ప్రాజెక్టు వరకూ 'అభివృద్ధి'పై సవివరమైన చర్చలు

**ఆలోచింపజేసే గణాంకాలు**

మిమ్మల్ని కదిలించి, రగిలించే అరుదైన గణాంకాలు

**పదునైన వ్యాసాలు**

వివిధ రంగాలలో లబ్ధప్రతిష్ఠులైన వారి వ్యాసాలు, వ్యాఖ్యానాలు

**అధ్యాపకులు, అధికారులు, ఉద్యమకారులు, నేతలు, విద్యార్థులు, సామాన్య పాఠకులు**

**అందరికీ ఉపయోగపడే సమాచారాన్నిచ్చే సమగ్ర ఆర్థిక, సామాజిక మాసపత్రిక**

విడి ప్రతి: రు. 10/- సంవత్సర చందా: రు. 120/-

ఎం.ఓ. / డి.డి. పంపవలసిన చిరునామా

# వీక్షణం

ఆర్థిక, సామాజిక మాస పత్రిక

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029. ఫోన్ / ఫాక్స్ : 040-55843495

సలహా మండలి:
ప్రొ॥ ఆర్.వి.ఆర్.చంద్రశేఖరరావు
ప్రొ॥ వకుళాభరణం రామకృష్ణ
ప్రొ॥ చక్రధరరావు
కాత్యాయని
బి.సాంబశివరాజు

గౌరవ సంపాదకులు:
ఎ.బి.కె. ప్రసాద్
ప్రధాన సంపాదకులు:
వి. హనుమంతరావు
వర్కింగ్ ఎడిటర్:
ఎన్. వేణుగోపాల్

# వీక్షణం
ఆర్థిక, సామాజిక మాసపత్రిక
సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

వార్షిక చందా: రు.120 విడి ప్రతి : రు. 10

59 జూన్ 2006

సంపాదకీయం

## రెండేళ్లలో సాధించినదేమిటి ?

మే 14 నాటికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అధికారంలోకి వచ్చి రెండు సంవత్సరాలు పూర్తి చేసుకున్నాయి. మిశ్రమ ఐక్యసంఘటన ప్రభుత్వంగా ఏర్పడిన కేంద్ర ప్రభుత్వం భాగస్వామ్య పక్షాల మధ్య తగాదాలతో బేరసారాలతో సవ్యంగానే నడుస్తున్నట్టు కనబడుతోంది. రాష్ట్రంలో తొలిసారిగా ఏర్పడిన మిశ్రమ మంత్రివర్గంలోంచి భాగస్వామ్య పక్షం వెళ్లిపోగా కాంగ్రెస్ పాలన మాత్రమే నడుస్తోంది. ఏ రాజకీయ ఐక్యత పునాదిగా ఈ ప్రభుత్వాలు ఏర్పడ్డాయో ఆ ఐక్యత ఇట్లా గందరగోళంలో ఉన్నవేళ ఆ ప్రభుత్వాలు అనుసరించిన రాజకీయార్థిక విధానాల మీద కూడ ఆ ప్రభావం ఉండక తప్పదు.

కేంద్ర ప్రభుత్వం విషయానికే వస్తే భాగస్వామ్య పక్షాలన్నీ కలిసి ఏర్పరచుకున్న యునైటెడ్ ప్రొగ్రెసివ్ అలయెన్స్ తన రాజకీయార్థిక విధానాలను నిర్దేశించే మార్గదర్శక పత్రంగా ఉమ్మడి కనీస ప్రణాళికను ప్రకటించుకుంది. ఆ ప్రణాళికా రచనే అస్పష్టంగా, ఏ నిర్వచనానికైనా, ఏ దిశకైనా లొంగేదిగా ఉందనుకుంటే, ఆ ప్రణాళికలోని ప్రజానుకూల అంశాలను అమలు చేయడంలో ప్రభుత్వం పూర్తిగా విఫలమయింది. ప్రజావ్యతిరేక, బహుళజాతి సంస్థల అనుకూల చర్యలను మాత్రం విపరీతమైన శ్రద్ధతో, హడావుడిగా అమలు చేస్తూ వచ్చింది. గత ఎన్‌డిఎ పాలనాకాలంలో అమలయిన ప్రజావ్యతిరేక చర్యలను ఆపలేదు సరిగదా మరింత వేగవంతం చేసింది. దేశంలో ప్రపంచీకరణ విధానాల రూపశిల్పి అయిన డా. మన్మోహన్‌సింగ్ పూర్తిగా నిర్ణయాధికారం ఉన్న ప్రధానమంత్రి పదవి చేపడితే నూతన ఆర్థిక విధానాలు ఎంత వడివడిగా అమలవుతాయో ఈ రెండేళ్ల పాలన చూపింది.

రాష్ట్ర ప్రభుత్వ విషయం చూస్తే వ్యవసాయరంగం, నీటిపారుదల రంగాలకు పెద్దపీట వేయడం మినహా మరే కోణంలోనూ గత తెలుగుదేశం ప్రభుత్వ విధానాలకూ ప్రస్తుత విధానాలకూ తేడా లేదు. ఆ మార్పులు ఉన్నరంగాలలోనూ మార్పుల ఫలితాలు ప్రజానుకూలంగా ఉండడం కన్న ఎక్కువగా కంట్రాక్టర్లకూ, ఆశ్రితులకూ అనుకూలంగా ఉన్నాయి. పాత ముఖ్యమంత్రిని ప్రపంచబ్యాంకు పాలేరుగా అభివర్ణించిన అప్పటి ప్రతిపక్షనాయకుడు, ఇప్పుడు ముఖ్యమంత్రి కాగానే ఆ పాలేరుతనం కోసం పడుతున్న పోటీకి ఈ రెండు సంవత్సరాలు అద్దం పట్టాయి. వేలాది ఎకరాల భూమిని బహుళ జాతి సంస్థలకు అప్పగించడం, డిఎఫ్ఐడి, ప్రపంచబ్యాంకులకు యథావిధిగా దాసోహం అనడం, ప్రశ్నిస్తున్న ప్రజలపై దమనకాండలు జరపడం, అంతకంతకు ఎక్కువగా పోలీసు యంత్రాంగంపై ఆధారపడడం, ఈ అపసవ్య విధానాలను కనబడకుండా చేసేందుకు పెద్ద ఎత్తున ఆడంబర స్వోత్కర్ష ప్రచారాలు సాగించడం - ఈ రెండు సంవత్సరాలలో ముఖ్యమంత్రి బొమ్మ మారింది తప్ప ప్రభుత్వ విధానాలేమీ మారినట్టు లేవు.

సంవత్సరాలు గడిచిపోతున్నా సందర్భాలూ స్వరూపాలూ స్వభావాలూ మారుతున్నట్టు లేవు. మౌలిక మార్పులు సరే, పైపై మార్పులన్నా జరుగుతున్నట్టులేవు.

## లోపలి పేజీల్లో...

### సమస్యల ప్రస్తావన దిశగానే 2006 శాసనసభ ఎన్నికలు

పశ్చిమబెంగాల్, అస్సాం, తమిళనాడు, పాండిచ్చేరి, కేరళ రాష్ట్రాలలో జరిగిన శాసనసభ ఎన్నికలలో సమస్యల ప్రస్తావనే తప్ప పరిష్కారాలు లేవని ఫలితాలు నిరూపిస్తున్నాయి.

విద్యాభూషణ్ ...7

### ఒబిసి రిజర్వేషన్లు - సంఘటిత పోరాట అవసరం

కార్పోరేట్ రంగంలోని బడా పెట్టుబడి దారులు, ఐటి రంగ ప్రముఖులు ప్రైవేటు రంగంలో రిజర్వేషన్ల ప్రతిపాదనను తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. వారి మనోభీష్ట ప్రతిఫలనమే... ఈ రిజర్వేషన్ల వ్యతిరేకత..

కె.సత్యనారాయణ ... 10

### సూక్ష్మ రుణ భారతం

పేదప్రజలకు ఏదో ఒరగబెడుతున్నామని ప్రపంచబ్యాంకు అధ్యక్షుడు ఉల్ఫోవిట్జ్ నుండి రాహుల్‌గాంధీ వరకు అందరూ వచ్చి గ్రామీణ మహిళలతో నాలుగు ముచ్చట్లు చెప్పి ఉపన్యాసాలు ఇస్తున్నారు. తెరవెనుక జరుగుతున్న ప్రైవేట్ మైక్రోఫైనాన్స్ కంపెనీల దోపిడిపై మాత్రం ఎవరూ పెదవి విప్పరు

కొణతం దిలీప్ ... 15






**వీక్షణం**

ఆర్థిక, సామాజిక మాసపత్రిక

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, ఫ్లోట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040 - 55843495

ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్, అజామాబాద్, హైదరాబాద్.

సహాయ సంపాదకులు : కొణతం దిలీప్
డి.వి.రామకృష్ణారావు

సర్క్యులేషన్ మేనేజర్ : వై.రామచంద్రం

కంపోజింగ్, లే ఔట్ : పి.అనల

## పాఠకుల వీక్షణం

నేను చేనేత కార్మికుడను. మగ్గం నేస్తూ జీవిస్తుంటాను. సామాజిక అంశాల పట్ల స్పందిస్తూ ఉంటాను. పేదల పక్షాన జరిగే కార్యక్రమాలకు నా వంతుగా పనిచేస్తుంటాను. చేనేత విజ్ఞాన విధాన కేంద్రం - చిప్ - రామకృష్ణాపురం వారి దగ్గర వీక్షణం పత్రిక చదువుతున్నాను. మా చేనేతరంగానికి సంబంధించి ప్రతినెల వ్యాసాలు మీ వీక్షణంలో ప్రచురిస్తున్నారు. ప్రస్తుతం చేనేత పరిస్థితిలో ఉన్న సంక్షోభానికి సజీవ నిజాలు మీ పత్రికలో వస్తున్నాయి. అలా రావటం వల్ల చేనేత విషయాలు తెలియని చాలమందికి చేనేత సంక్షోభం గురించి, ఈ రంగాన్ని అడ్డం పెట్టుకొని బతికే పెట్టుబడిదారుల గురించి వీలైనంత క్షుణ్ణంగా సామాజిక ఉద్యమ కార్యకర్తలకు మీ పత్రిక ఉపయోగపడుతుంది.

సామాజిక, ఆర్థిక, రాజకీయ సమస్యలు అనేకం సామాన్య ప్రజలకు అందుబాటులో లేవనేది గమనించాలి. దేశ రాజకీయ పరిస్థితులు కనీసం ఈ ప్రజలకు అందుబాటులో కూడా లేవు. సమాచారం కూడా తెలియడం లేదు. ఒకవేళ తెలిసినా గ్లోబల్ పత్రికల ప్రచారం, కలర్ ఫోటోలు, అర్ధనగ్న దృశ్యాలు అందమైన బొమ్మలు - దీంతో అసలు విషయం మరుగునపడి పోతుంది. ఆలోచించే పరిస్థితిలో కూడా యువత ఉండడం లేదు.

'వీక్షణం' ద్వారా అటువంటి పరిస్థితి కొంత మెరుగుపడింది. యువకులు 'వీక్షణం' చదివి చర్చించుకోవడం జరుగుతుంది. ఇది కొంత సమాజానికి ఉపయోగకరం కదా- కాబట్టి 'వీక్షణం' నుండి మంచి రచనలు రావాలి. వస్తాయని ఆశిస్తూ

**- బండారు జ్వాలా నరసింహం, ఈపూఏరుపాలెం**

మే 2006 పాఠకుల వీక్షణంలో పి.రామలక్ష్మి గారి అభిప్రాయాలు సరియైనవి కావు. రచనలపై నిర్మాణాత్మక విమర్శలు అవసరం. వామపక్ష రచయితల, మేధావుల పట్ల వారికి ఎందుకంత కోపమో వారి వ్యక్తిగతం తెలిస్తే తప్ప తెలుసుకోలేక పోతున్నాను. ఉత్తరాన్ని బట్టి వారు బహుశా నిష్పాక్షికంగా ఉండనివారై ఉంటారని భావిస్తున్నాను.

**- బి.సైదులు, కురవి**

'వాట్ - కొత్త ఆలోచనలు కావాలి' అన్న శీర్షికతో టి.వి.అధికారి గారు రాసిన వ్యాసంలో కొత్త ఆలోచనలేమీ లేకపోవడం ఆశ్చర్యకరం. నిజానికి మనదేశంలో వాట్ ప్రవేశపెట్టడం మన వినియోగదారులకు మెరుగైన సేవలు అందించడం కొరకో, మన వ్యాపారస్తులకు సులభంగా వ్యాపారం చేసుకునే అవకాశం ఇవ్వడం కొరకో రాలేదు. మన దేశంలో వాట్‌ను పూర్తిగా ప్రపంచబ్యాంకు ఆదేశాల మేరకు ప్రవేశపెట్టడం జరిగిందని పెద్దలు చెప్పగా విన్నాను. ప్రపంచబ్యాంకు షరతులతో పాటుగా, మన ప్రభుత్వానికి కూడ పన్నుల ఆదాయాన్ని పెంచడానికి కూడ ఈ పద్ధతి ఉపయోగపడుతుంది. ప్రపంచబ్యాంకుకూ, సరుకులు అమ్ముకునే ఎంఎన్‌సిలకూ ఏ ఆటంకాలు లేని ఉమ్మడి మార్కెట్ కావాలి. ఈ విధంగా ఎవరో పరాయి వారి అవసరాల కొరకు ప్రవేశించిన కొత్తపద్ధతి మన ప్రజలకు, వినియోగదారులకు ఏమయినా ప్రయోజనాలు చేకూర్చిందా టి.వి.అధికారి గారి లాంటి మేధావులు ఆలోచించాలి. అప్పుడు కొత్త ఆలోచనలకు వీలవుతుంది.

**- పి.నాగభూషణ గుప్తా, నిజామాబాద్**

నూతన ఆర్థిక విధానాలు మొదలయినప్పటి నుండి నయా ఉదారవాదం అనే కొత్త మాట వింటున్నాము. దీనికి సరైన అర్థం ఏమిటో తెలియడం లేదు. ఇన్నాళ్లూ ఈమాట సిపిఐ, సిపిఎం వారి సాహిత్యంలో కనబడుతుండేది. ఇప్పుడు కొణతం దిలీప్ గారి వ్యాసం (ప్రపంచబ్యాంక్ - ఎడిబి - రహస్య కవలలు, వీక్షణం మే 2006)లో కూడ ఆ మాట ఉంది. దీన్ని పెట్టుబడిదారీ విధానం, సామ్రాజ్యవాదం అనే మాటలకు పర్యాయపదంగా వాడుతున్నారా? అలాంటప్పుడు ఆ మాటలే వాడవచ్చు గదా? నయా ఉదారవాద అనేసరికి అందులో ఎంతో కొంత ఉదారత్వం ఉందనే ధ్వని వినబడడం లేదా? రావలసినంత వ్యతిరేకత రాకుండా అది అడ్డుకోవడం లేదా?

**- కె.అనిల్‌కుమార్, తిరుపతి**

### రచయితలకు సూచన

**ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడ అంతే. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.**

- సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. అంటే ఏ నెల సంచిక ఆ నెల మొదటి వారానికల్లా పాఠకులకు చేరుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారం లోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

**- సర్క్యులేషన్ మేనేజర్**

# కొత్త పుస్తకాలు






- ఎదురగ్గి - నవల - కనుంపల్లి రాజారాం - విరసం అనంతపురం జిల్లా యూనిట్ ప్రచురణ, 338 పేజీలు. 1/8 డెమీ, రు.100, ప్రతులకు : ఎస్.రవికుమార్, 5-1307, దొరసానిపల్లె రోడ్, ప్రొద్దుటూరు, కడప జిల్లా
- నానీలు - సంవీక్షణం - సంపాదకుడు- డా.ఎస్.రఘు, మనస్వి ప్రచిరణలు, 120 పేజీలు, 1/8 డెమీ, రు.60, ప్రతులకు : అక్షరం, 4-2-171/1, పోలీస్ హౌజింగ్ కాలనీ, మమత మెడికల్ కాలేజ్ రోడ్, ఖమ్మం - 507002
- బతుకుబాట- నవలా కథన కావ్యం - శీలా వీర్రాజు, 192 పేజీలు, 1/8 డెమీ, రు.80, ప్రతులకు : శీలా వీర్రాజు, 2/సి, బ్రహ్మానంద నగర్, మలకపేట, హైదరాబాద్ - 500 036
- ఐక్యరాజ్య సమితి - యూరోపియన్ యూనియన్ - గూడవల్లి నాగేశ్వరరావు, విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్ ప్రచురణ, 76 పేజీలు, 1/8 క్రౌన్, రు.12
- ప్రపంచ సామాజిక వేదిక - ద్వంద్వ పౌరసత్వం - గూడవల్లి నాగేశ్వరరావు, విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్ ప్రచురణ, 42 పేజీలు, 1/8 క్రౌన్, రు.8
- భారతదేశంలో నదుల అనుసంధానం - గూడవల్లి నాగేశ్వరరావు, విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్, 36 పేజీలు, 1/8 క్రౌన్, రు.6

  పై మూడు పుస్తకాలు ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞానభవన్, ఆబిడ్స్, హైదరాబాద్ - 500 001

- టేకోని మడవ ఘటన - వాస్తవాలు - న్యూ డెమోక్రసీపై మావోయిస్టుల శతృపూరిత ప్రచారం - రాష్ట్రకమిటీ, సిపిఐ (ఎంఎల్ న్యూడెమోక్రసీ) ప్రచురణ, 92 పేజీలు, 1/8 డెమీ. రు.15, ప్రతులకు : ప్రజాపంథా, మార్క్స్ భవన్, ఇం.నెం.658, విద్యానగర్, 7వ లైన్, హైదరాబాద్ - 500 044
- చత్తీస్‌ఘడ్ ఆదివాసీ ప్రజలపై జరుగుతున్న మారణహోమమే 'సాల్వాజుడుం' - దిక్సూచి ప్రచురణలు, 42పేజీలు, 1/8 డెమీ, రు.5 ప్రతులకు: గోరు మాధవరావు, జింకిభద్ర గ్రామం, సోంపేట మండలం, శ్రీకాకుళం జిల్లా.






# సమస్యల ప్రస్తావనా దిశగానే 2006 శాసనసభ ఎన్నికలు

విద్యాభూషణ్

ఎన్నికలు అంటే ప్రజల మనోభీష్టానికి అద్దం పట్టడమే. అంతటితో ఆగకుండా బరిలో ఉన్న రాజకీయపార్టీల పట్ల ఆయా ప్రజలకు ఉన్న అంతర్యాన్నీ వ్యక్తంచేస్తాయి. దీంతో ఆయా రాజకీయ పార్టీలు ప్రకటించుకున్న రాజకీయ ప్రణాళికలకు ప్రజల మద్దతు ఏ పాటి? ఇక ఆయా రాజకీయా పార్టీల భవిష్యత్తూ అవగతం కావాలి. కానీ ఇటీవల ఐదు (అస్సాం, కేరళ, పశ్చిమబెంగాల్, తమిళనాడు, పాండిచ్చేరి) రాష్ట్రాలతో పాటు రాయబరేలి నియోజకవర్గ ఉప ఎన్నికా జరిగాయి. ఫలితాలను బేరీజు వేసుకుంటే రాయ్‌బరేలీ ఉప ఎన్నికల్లో కాంగ్రెస్ నేతకు (కాంగ్రెస్ నేతకు అనేకంటే సోనియాగాంధీకి అనడం సరైంది) అనూహ్య మెజార్టీ వచ్చింది. పోటీలో ఉన్న అన్ని రాజకీయ పక్షాలు తమ తమ డిపాజిట్లను కోల్పోయాయి. మరి ఎన్నికలు జరిగిన మిగతా ఐదు రాష్ట్రాల్లో కాంగ్రెస్‌పార్టీ, చావు తప్పి కన్ను లొట్టపోయినట్టయింది. కానీ ఇక్కడ కాంగ్రెస్ పార్టీ రాయ్‌బరేలీ ఎన్నిక ఫలితాన్నే గీటురాయిగా తీసుకుని, ఇది ప్రజాస్వామ్య విలువల విజయమని నేతలు వారి వీపులు వారే చరుచుకున్నారు. కానీ వాస్తవాలను పరిగణనలోకి తీసుకుంటే అసలు రాయ్‌బరేలీ ఎన్నికల ఫలితాలను గమనంలోకి తీసుకో నవసరం లేదు. ఎందుకంటే నెహ్రూ కుటుంబ రాజకీయ వ్యవస్థలం రాయ్‌బరేలీ. ఆ కుటుంబానికి చెందిన పార్టీ అగ్రనేత, ప్రతిష్ఠాత్మ కంగా రాజీనామా చేసి, తెచ్చిపెట్టిన ఎన్నికయినందున అక్కడి ఫలితాలు భిన్నంగానే ఉంటాయి, వాటిని దేశ రాజకీయాలకు అన్వయించి, జనరలైజ్ చేయడం సరైంది కాదు.

## వర్తమానం

ఇక, మిగతా ఐదురాష్ట్రాల్లో జరిగిన శాసనసభా ఎన్నికల ఫలితాలను విశ్లేషిస్తే అసలురంగు బయటపడుతుంది. మరా సంగతేదో చూద్దాం!

**పశ్చిమబెంగాల్ :**

మే 2006 శాసనసభ ఎన్నికలు, మొత్తం స్థానాలు - 293

| పార్టీ | స్థానాలు | ఓట్లశాతం |
|---|---|---|
| వామపక్ష కూటమి | 235 | 49.6 |
| కాంగ్రెస్ | 21 | 15 |
| తృణమూల్ కాంగ్రెస్ బిజెపి | 29 | 26.3 |
| ఇతరములు | 8 | 9.0 |

ఇంతవరకూ వామపక్ష ప్రభుత్వపరంగా సైంటిఫిక్ రిగ్గింగ్ ఆరోపణకు నేటి ఎన్నికల్లో వాస్తవం నిగ్గుతేలింది. అంటే వామపక్షం ఆ ఆరోపణ నుండి బైటపడింది. ఇందుకు ఐదు విడతలుగా ఎన్నికలను నిర్వహించడమే కాకుండా, ఎన్నికల అధికార్లుగా మార్క్సిస్టుపార్టీకి చెందిన ఉపాధ్యాయులను నియమించకుండా, ప్రభుత్వరంగ ఉద్యోగుల వినియోగం, సాధ్యమైనన్ని పోలింగ్ స్టేషన్ల ఏర్పాటు, పారా మిలిటరీ ఇవన్నీ ఎన్నికల కమీషన్ ప్రత్యేక శ్రద్ధతో చేపట్టింది.

మొత్తం 293 స్థానాల్లో 235 స్థానాలను వామపక్ష కూటమి కైవశం చేసుకుంది. ఇక్కడ దశాబ్దాలుగా అధికారంలో ఉన్న వామపక్షం విజయఢంకా మోగించినా ఒకింత, సామాన్యుల నిరాదరణను చవిచూసింది. ఈ గెలుపుకు ప్రధానకారణం ప్రత్యామ్నాయం లేకపోవడమే. అయితే, కాంగ్రెస్-బిజెపిల మధ్య ఎన్నికల పొత్తు కుదరకపోవడం మరో కారణం.

పార్టీల పరంగా పోలయిన ఓట్లశాతాన్ని పరిశీలిస్తే కాంగ్రెస్‌పార్టీకి గతంకన్నా 6.9 శాతం అధికంగా వచ్చాయి. తృణమూల్ కాంగ్రెస్ 4.3 శాతం ఓట్లను, బిజెపి 3.3. శాతం ఓట్లను కోల్పోయాయి. ఈ రెండు పార్టీలు కోల్పోయిన ఓట్లను కాంగ్రెస్‌పార్టీయే గెల్చుకుంది. మార్క్సిస్టుపార్టీకి 176 స్థానాలు నేరుగా వచ్చినా అదనపు ఓట్లు వచ్చిన దాఖలాలు లేవు.

పశ్చిమబెంగాల్ గ్రామీణం సిపిఎంకు కంచుకోటని వివికిడి. కానీ నేటి ఎన్నికల్లో ఈ గ్రామీణ ఓట్లను సైతం ఆ పార్టీ కోల్పోయింది. పట్టణ ప్రాంతాల్లో ఓట్లను పెంచుకుంది. ఇందుకు ప్రధానకారణం గ్రామీణప్రాంతాల్లో దశాబ్దాల క్రితం అమలుపర్చిన భూసంస్కరణల ద్వారా వచ్చిన చేరెడునేల పెరిగిన కుటుంబ పరిస్థితుల దృష్ట్యా ఎందుకూ కొరగాకుండా పోవడం. నేడు తీసుకున్న నినాదం పారిశ్రామికీకరణ. ఆ పార్టీ నేత ఏచూరి గారి మాటల్లోనైతే, జాబ్‌లెస్ 'ఇండస్ట్రియలైజేషన్' దీంతో ఉపాధి అగ్రవర్గాలకే పరిమితమయ్యే ఉన్నత వేతన ఉద్యోగాలకే 'ఉపాధి' పరిమితం కావడం.... సాధారణ జనానికి ఉపాధి గానీ ఆదాయపెంపుకు కనీస ప్రత్యామ్నాయం కూడా కరువయి పోయింది. ఈ పారిశ్రామీకరణ ధోరణికి ఓ తాజా ఉదాహరణ - బెంగాల్‌లో వామపక్ష ప్రభుత్వం టాటావారి కార్ల ప్రాజెక్టుకు వందల ఎకరాలను కేటాయిస్తే, ఉపాధి ఉన్నత వేతన వర్గాలకు పోగా,

ఆ మేరకు వ్యవసాయకార్మికుల భృతి మృగ్యమయ్యే పరిస్థితి నెలకొంటుంది. ఉపాధికి అర్థమే మారిపోతుంది. ఈ అసంతృప్తి ప్రత్యామ్నాయ అభివృద్ధి ఎజెండా అవసరాన్ని నొక్కిచెప్తుంది. అయితే మరి మూడింట రెండొంతుల మెజార్టీ అన్న సంబరం, బహుళపార్టీ వ్యవస్థ విధానలోపం తప్ప మరోటి కాదు. ఎందుకంటే ప్రత్యక్ష రెండు పార్టీల వ్యవస్థ (బైపార్టీ)యితే, ఈ 50 శాతం ఓట్లతో మూడింట రెండొంతుల మెజార్టీ సాధ్యమా? విజ్ఞతతో ఆలోచించాలి.

**కేరళ :**

మే 2006 శాసనసభ ఎన్నికలు - మొత్తం స్థానాలు- 140

| పార్టీ పేరు | స్థానాలు | ఓట్లశాతం |
|---|---|---|
| వామపక్ష ప్రజాస్వామ్య కూటమి (ఎల్‌డిఎఫ్) | 98 | 48.6 |
| ఐక్యప్రజాస్వామ్య కూటమి (యుడిఎఫ్) | 42 | 42.9 |
| బిజెపి | 0 | 4.7 |
| ఇతరములు | 0 | 3.8 |

కేరళ శాసనసభ ఎన్నికల సరళిని గత ఎన్నికలతో పోల్చిచూస్తే ప్రతిసారీ ఇక్కడ రెండుపార్టీల వ్యవస్థా ఫలితాలు కన్పిస్తాయి. ఒకసారి ఎల్‌డిఎఫ్‌కు పట్టం కడితే, తదుపరి ఎన్నికల్లో యుడిఎఫ్‌కు అధికారం... తర్వాత మళ్లీ ఎల్‌డిఎఫ్ ఇలా.

గతసారి ఎన్నికల్లో ముస్లిం ఓటర్లు, అలాగే క్రిస్టియన్ ఓటర్లు యుడిఎఫ్‌కు అనుగ్రహం చూపితే, ఈసారి ఎన్నికల్లో వారు ఎల్‌డిఎఫ్‌ను ఆదరించారు. కారణం ప్రత్యేకంగా ఏమీలేదు.. ఓటర్ల భాషలో అయితే కేవలం మార్పు కోసం. 2001 నాటి సాధారణ ఎన్నికల్లో ముస్లిం ఆధిపత్య నియోజకవర్గాల్లో 4 స్థానాలను గెల్చుకున్న ఎల్‌డిఎఫ్ ఈసారి (2006) 13 స్థానాలను గెల్చుకుంది. అలాగే క్రిస్టియన్ వర్గ ఆధిపత్య ప్రాంతాల్లో 34 నియోజకవర్గాలకు గానూ 20 నియోజకవర్గాలను ఎల్‌డిఎఫ్‌కు అప్పగించారు. దీంతో మాలప్పురం, కోజికోడ్‌లలో ఎల్‌డిఎఫ్‌కు అనూహ్య విజయం చేకూరింది.

కులాల ఎన్నికల సరళిలో సైతం ఇదే అభిమానాన్ని ఎల్‌డిఎఫ్ కూడగట్టుకుంది. కేరళ వామపక్ష ఓటింగ్ సరళికీ, పశ్చిమబెంగాల్ వామపక్ష ఓటింగ్‌కు తేడా స్పష్టంగా కన్పిస్తుంది. కేరళలో పేదవర్గాల ఓట్లు 54 శాతం మేరకు వామపక్ష కూటమికి (ఎల్‌డిఎఫ్), ధనికవర్గం ఓట్లు 52 శాతం యుడిఎఫ్‌కు, మధ్యతరగతి ఓట్లయితే 45 శాతం ఎల్‌డిఎఫ్‌కు, 44 శాతం యుడిఎఫ్‌కు, తక్కిన ఒక్క శాతం బిజెపికి పోలయ్యాయి.

ప్రతీ ఎన్నికల్లోనూ గెలుపోటముల మధ్య తేడా 3 శాతమే. అయితే 2001లో మాత్రం మార్క్సిస్టుపార్టీలో అంతర్గత కుమ్ములాటలు నెలకొన్న కారణంగా గెలుపు- ఓటముల తేడా 5.4కు చేరింది. ఈసారి కూడా ఇదే క్రమంలో తేడా 5.7శాతంగా ఉంది తేడా శాతం. ఇది బిజెపి నుంచి దారిమళ్లిన ఓట్ల ఫలితం.

ఇక పోటీలో ఉన్న రెండుకూటముల మధ్య తేడాలను పరిశీలిస్తే నాయకత్వ ప్రభావం సైతం అంతగా కన్పించదు. రెండుకూటములూ సమానంగానే కన్పిస్తాయి. ఎల్‌డిఎఫ్‌లో అచ్యుతానందన్ - విజయన్‌ల మధ్య విభేదాలున్నట్లే, యుడిఎఫ్‌లో చాంది, డెమోక్రటిక్ కాంగ్రెస్ నేత కరుణాకరన్‌ల మధ్య విభేదాలున్నాయి. బెంగాల్ వామపక్ష ప్రభుత్వం సంస్కరణలపై తీసుకున్న నిర్ణయంకన్నా కేరళలో అచ్యుతానందన్ వైఖరికి మొగ్గు పెరిగిన కారణంగా ప్రజలు ఎల్‌డిఎఫ్‌కు అధికారం కట్టబెట్టారు ప్రజలు. అయినా సైద్ధాంతిక ప్రభావంకన్నా అధికారపక్ష మార్పిడే ఇక్కడి ప్రజలు కోరుకున్నారనిపిస్తుంది. ఎందుకంటే పర్యాటకరంగంలో ప్రైవేటీకరణకు పెద్దపీట వెయ్యడం చూస్తుంటే!

**అస్సాం :**

మే 2006 శాసనసభ ఎన్నికలు, మొత్తం స్థానాలు - 126

| పార్టీ | స్థానాలు | ఓట్లశాతం |
|---|---|---|
| కాంగ్రెస్ | 51 | 29.1 |
| ఎజిపి | 28 | 23.7 |
| బిజెపి | 11 | 10.1 |
| ఇతరములు | 36 | 37.1 |

అస్సాం ఎన్నికల్లో గెలిచిన పెద్దపార్టీగా కాంగ్రెస్ అవతరించినా ప్రజాగ్రహాన్ని బాగా చవిచూడాల్సి వచ్చిందన్నది ఓ వాస్తవం. అందుకే సంకీర్ణ ఏర్పాటుకు అన్వేషించాల్సి వస్తుంది. ఇక్కడ పరిస్థితి అంతా అవకాశవాద ప్రాతిపదికన కన్పిస్తుంది. అస్సాం గణ పరిషత్ (ఎజిపి) కాంగ్రెస్‌కు ప్రధాన వైరిపక్షం. లౌకిక విలువల ప్రాతిపదికన వామపక్షాలు ఎజిపితో పొత్తుకు అంగీకరించాయి. ఇక మరో మార్గం లేని పరిస్థితుల్లో కాంగ్రెస్ బోడో ప్రత్యేక వాదులతో చేయి కలపాల్సి వచ్చింది. (బోడోలాండ్ పీపుల్స్ ప్రొగ్రెసివ్ ఫ్రంట్)

గత ప్రభుత్వనేతగా గొగై వైఫల్యం సుమారు 20 స్థానాలను (10.6 శాతం ఓట్లను) కోల్పోయేలా చేసింది. ఉల్ఫా తీవ్రవాదుల పట్ల బుజ్జగింపు ధోరణిని ప్రదర్శించిన కారణంగా 31 శాతంగా ఉన్న ముస్లిం ఓటర్లను, టీ తోటల పెంపకందార్లయిన గిరిజనులనూ దూరం చేసుకోవాల్సి వచ్చింది. మరోవైపు ఐఎం (డిటి) చట్టాన్ని సుప్రీంకోర్టు రద్దు చేయడం - ముస్లింల ఆగ్రహానికి గురికావాల్సి వచ్చింది. టీతోటల పెంపకందార్లయిన గిరిజనులను ఎస్సీ తెగల్లో చేర్చాలన్న డిమాండును కేంద్రంలోని యుపిఎ ప్రభుత్వం పట్టించుకోలేదు. పైగా మూతపడ్డ టీతోటలనూ తెరిపించలేకపోవడంతో నిరుద్యోగం మరింతగా పెరిగింది. ఈ వైఫల్యాలు కాంగ్రెస్‌ను ప్రజలనుంచి దూరం చేసాయి. అస్సాం యునైటెడ్ డెమోక్రటిక్ ఫ్రంట్ పేరిట మైనార్టీవర్గ కూటమిని ఏర్పాటుచేసిన అజ్మాల్ పదిస్థానాలను గెల్చుకున్నారు. అయితే కాంగ్రెస్‌పార్టీ ఈయన మద్దతును పొందాలంటే నాయకత్వంస్థానం

నుంచి గొగైని మార్చాల్సి ఉంది. అస్సాం పినిసి నేతలంతా ఇంటిదారి పట్టడంతో నాయకత్వానికి గొగైని మించిన నేత లేడు. సీనియర్ పార్లమెంటు సభ్యులుగా ఉన్న విజయ్‌కృష్ణ, హందిక్యు రాష్ట్రరాజకీయాల్లోకి వచ్చేందుకు సుముఖంగా లేరు.

ఇక, ఎజిపి చరిత్రను తిరగేస్తే 1985లో కాంగ్రెస్‌కు ప్రత్యామ్నాయంగా ధీటుగా నిల్చింది. 2001 ఎన్నికల్లో బిజెపితో పొత్తు పెట్టుకుని అహోమియా ముస్లింల ఆగ్రహానికి గురైంది. దీంతో నాటి నేత ప్రఫుల్లకుమార్ మహంత పై క్రమశిక్షణాచర్య పడి ఆయన ప్రొగ్రెసివ్ ఎజిపి పేరిట వేరే కుంపటి పెట్టడానికి దారితీసింది. ఫలితంగా 26.31 శాతం అదనపు ఓట్లతో బిజెపి మరో రెండు స్థానాలను గెల్చుకునేలా చేసింది.

ఈ విషమ పరిస్థితుల్లో కాంగ్రెస్ గెలుపు అస్సాం గణ పరిషత్ (ఎజిపి)తో ఎన్నికలపొత్తు పెట్టుకున్న వామపక్ష మద్దతుతో సంకీర్ణ ప్రభుత్వ ఏర్పాటుకై ఎదురుచూస్తుంది. మరి ఇది ఆ పార్టీ నేతలు కీర్తించదగ్గ ఘనవిజయం ఎలా కాగలదో? మరి.

**తమిళనాడు:**

మే 2006 శాసనసభ ఎన్నికలు, మొత్తం స్థానాలు - 234

| పార్టీపేరు | స్థానాలు | ఓట్లశాతం |
|---|---|---|
| డిఎంకె మిత్రపక్షం | 163 | 44.5 |
| ఎఐఎడిఎంకె మిత్రపక్షం | 69 | 39.8 |
| ఇతరములు | 2 | 13.7 |

ఈ ఎన్నికల్లో ఎఐఎడిఎంకె నేత జయలలిత వైఫల్యమే ప్రధానకారణం. దేశప్రజలు సంస్కరణల నేతృత్వంలో నేడు అనుభవిస్తున్న దుర్భర పరిస్థితుల ప్రాబల్యాన్ని ఇక్కడి ఎన్నికల ఫలితాలు తెలియజేస్తున్నాయి. అనాదిగా కొనసాగుతున్న పొత్తులస్థానంలో ప్రజల సమస్యలను పరిష్కరించగలరనే సత్తా లేదా పరిష్కరించగలరన్న విశ్వాసమూ ఇక్కడ గెలిచాయి.

ముఖాముఖీగా జరగాల్సిన ఎన్నికలు విజయకాంత్ దేశీయ మరుమలార్చి ద్రవిడ కజగమ్ (డిఎండికె) పేరిట రంగప్రవేశం చేసి, డిఎంకె కూటమి గెలుపును తేలిక చేసాయి. విజయ్‌కాంత్ రంగప్రవేశం మొత్తం ఓట్లలో 3 శాతాన్ని కైవశం చేసుకుని జయలలిత బలమైన కేంద్రాల్లో త్రిముఖపోటీకి అవకాశాన్నిచ్చి, అంతిమంగా కరుణానిధి గెలుపును ఖరారు చేశాయి.

పైగా ఉపాధి లేక పేదరికంతో అలమటిస్తున్న బడుగువర్గాలకు డిఎంకె నేత కరుణానిధి ఇచ్చిన రెండు రూపాయలకే కిలో బియ్యం, ఉచితంగా 10 కిలోల బియ్యం వంటి నినాదాలు గెలుపును తెచ్చి పెట్టాయనడంలో సందేహం ఎంతమాత్రం లేదు. అది అమలు చేస్తారా? చెయ్యరా? అన్నది తర్వాతి సంగతి. ఇస్తామనడమే గగనంగా భావిస్తున్న ఓటర్ల దౌర్భాగ్యస్థితి ఇది.

**పాండిచ్చేరి:**

మే 2006 శాసనసభ ఎన్నికలు, మొత్తం సీట్లు - 30

| | |
|---|---|
| కాంగ్రెస్ కూటమి | 20 |
| ఎఐడిఎంకె కూటమి | 07 |
| ఇతరులు | 03 |

కాంగ్రెస్ ప్రాభవానికి ఎదుగూ- బొదుగూ లేదని రూఢిగా తేల్చి చెప్పే ఎన్నికల ఫలితమిది. అధికారం వెలగబెట్టి ప్రజాదరణను పొందలేక 'ఎక్కడవేసిన గొంగళి అక్కడే' అన్న రీతిన పరుల సాయంతో తప్ప ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయలేని పరిస్థితి. సమీప తమిళనాడు రాజకీయ ప్రభావం సైతం ఈ పాండిచ్చేరి ఫలితాలపై ప్రతిఫలించిందన్నా అతిశయోక్తి ఎంతమాత్రం కాదు.

**ఎవరిదీ గెలుపు - ప్రజలదా? పాలకులదా**

రాయ్‌బరేలీలో మినహా మిగతా ఐదురాష్ట్రాల్లో అక్కడి ప్రాంతీయ పార్టీల నేతల ఆసరా లేందే మనుగడ కొనసాగించలేని పరిస్థితి కాంగ్రెస్‌ది. ఈ ఎన్నికలు జరిగిన ఐదు రాష్ట్రాల్లోనే కాదు, ఇతరత్రా సైతం లాలూ ఆసరాతో బీహార్‌లో, శరద్‌పవార్ హామీతో మహారాష్ట్రలో, దేవగౌడ అండతో కర్నాటకలో, మాయావతి చలువతో యుపిలో ఇలా నేతల్లో పునాదులున్న నేతలు కరువైపోతున్న పరిస్థితి దాపురించింది. సంస్కరణలను భుజాన వేసుకున్న పాపానికి 'సంక్షేమం', 'అభివృద్ధి' వంటి నినాదాల్ను వదిలేసుకుని, ఎటూగాని సందిగ్ధావస్థలో పడినట్టయింది కాంగ్రెస్ పరిస్థితి. స్వంత మెజార్టీతో ప్రభుత్వాన్ని నిర్వహించగలిగిన అస్సాంలో, కాంగ్రెస్ సంకీర్ణ ప్రభుత్వ ఏర్పాటుకై ఎదురుచూస్తుంది. పశ్చిమబెంగాల్‌లో గెలుపుమాట దేవుడెరుగు తమ నినాదాలతో వామపక్షాలు గెలువగా, కాంగ్రెస్ నామమాత్రంగా ఓట్లను పెంచుకోగలిగి సంతృప్తి పడాల్సి వచ్చింది. ఇక తమిళనాడులో గెలుపు, డిఎంకె చలువేనన్నది జగమెరిగిన సత్యం. సంక్షేమ నినాదాలనివ్వని పరాధీనతే ఇందుకు... ఈ దైన్యానికి కారణం! పాండిచ్చేరి ఫలితం నో లాస్, నో గెయిన్! కేరళలో మిత్రపక్షంతో ఒనగూడిన అధికారం కోల్పోవడం.

ఈ క్రమం అంతా దేన్ని సూచిస్తుంది? స్పష్టమైన రాజకీయ విధివిధానాలతో ప్రజలనెదుర్కొనలేని దైన్యాన్ని కాదూ? అభివృద్ధి అంటే ఇదే. లేదా సంక్షేమం... మేం చేపడుతుంది ఇదీ! ఉపాధికల్పన పట్ల ఇదీ మా వైఖరి అని చెప్పుకోలేని ఇబ్బందికర పరిస్థితి జాతీయ పాలకవర్గాలది. తమ తోక పట్టుకుని తిరుగుతున్నందున, సంకీర్ణ వైభోగంలో చేయగలిగినదంతా చేస్తాం! అన్నది ఆయా ప్రాంతీయపార్టీల వైఖరి! ఇక మా సమస్యలను తీర్చకున్నా పోయే! కనీసం ప్రస్తావించినందుకైనా మన మద్దతును అందిద్దామన్నది ఓటర్ల దౌర్భాగ్య పరిస్థితి! ముందైతే గెలవనీ! గెలిచినంక మన తిప్పలు మనకు తప్పవు కదా! అన్నది సామాన్యుని అనుభవం! ఇక ఇప్పుడైనా తగు ప్రత్యామ్నాయాన్ని శోధించాలి మరి! ❑

# ఒబిసి రిజర్వేషన్లు - సంఘటిత పోరాట అవసరం

కె.సత్యనారాయణ

కేంద్రప్రభుత్వం ఒబిసిలకు ఐఐటి, ఐఐఎం, కేంద్ర ప్రభుత్వం అధ్వర్యంలో నడిచే మెడికల్, ఇంజనీరింగ్ కాలేజీలలో, కేంద్రీయ విశ్వవిద్యాలయాల్లో 27 శాతం సీట్లు రిజర్వు చేస్తామని ప్రకటించగానే అగ్రకుల విద్యార్థులు తమ వ్యతిరేకతను వ్యక్తం చేసారు. ఇంగ్లీషు పత్రికలు, ఛానల్స్ పనిగట్టుకుని ఈ ప్రతిపాదనకు వ్యతిరేకంగా ప్రచారంచేసి, అగ్రకుల విద్యార్థుల ఆందోళనకు ఆజ్యం పోసాయి. ముఖ్యంగా ఢిల్లీలో, బొంబాయిలో, కలకత్తాలో, ఇంకా దేశంలో కొన్ని పట్టణాల్లో ఒబిసి రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళన గత 15 రోజులుగా వివిధ రకాల ప్రదర్శనలు, నిరసనల రూపంలో సాగుతూ ఉంది. అగ్రకుల విద్యార్థులపై చిన్న లాఠీఛార్జీ జరిగితే అది జాతీయ వార్తగా, పార్లమెంటులో చర్చనీయాంశమయింది. 'మండల్ - 2'గా పిలవబడుతున్న ఈ రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళనని ప్రస్తుత నిర్దిష్ట సామాజిక, రాజకీయ పరిస్థితుల్లో ఎలా అర్థం చేసుకోవాలి?

1990లో మండల్ నివేదిక ప్రకారం ఒబిసిలకు 27 శాతం రిజర్వేషన్లు కల్పించిన సందర్భంగా అగ్రకుల విద్యార్థులు నడిపిన మండల్ వ్యతిరేక ఆందోళన విఫలమయింది. ఒబిసిలకు కేంద్రప్రభుత్వ ఉద్యోగాల్లో రిజర్వేషన్లు అమలు అవుతున్నాయి. మండల్ అనుకూల ఉద్యమం నుంచి ఒబిసిలు ఒక రాజకీయశక్తిగా ఎదిగారు. మండల్ ఉద్యమ సందర్భంగా భారత సమాజంలో కులం, దాని ప్రభావంపై విస్తృత చర్చ జరిగింది. కుల ప్రాతిపదికన రిజర్వేషన్లు కల్పించడం సరైనదేనని ప్రజలు, మేధావులు, చివరకు సుప్రీంకోర్టు కూడా అంగీకరించింది. కుల ప్రాతిపదికన రిజర్వేషన్లు కల్పించడం, ఒబిసిలకు రిజర్వేషన్లు అమలుచేయడం సర్వసాధారణ విషయంగా మారింది. దక్షిణాది రాష్ట్రాల్లో ఒబిసిలకు రిజర్వేషన్లు ఎప్పటినుంచో అమలవుతున్నయి. మన సమాజంలో ఎంతో సాధికారతను, ఆమోదాన్ని పొందిన రిజర్వేషన్లు మళ్లీ ఎందుకు వివాదాస్పదమయ్యాయి? 1990 నుంచి 2006 వరకు ఈ 15 ఏళ్ల కాలంలో మన సమాజంలో ఇంకా కులప్రాతిపదికన రిజర్వేషన్లకు ఆమోదం లభించలేదా? మనదేశంలో అగ్రకుల సమాజం కనీసమాత్రంగానైనా ప్రజాస్వామీకరణ చెందలేదా? కులరహిత సమాజాన్ని, సమానత్వాన్ని ఆదర్శమైన, ఆచరణీయమైన విలువలుగా మనదేశ ప్రజలు ఇప్పటికీ గుర్తించడం లేదా? 'మండల్ -2' వ్యతిరేక ఆందోళన చూస్తున్నవారికి ఈ ప్రశ్నలు రాక మానవు.

నేడు ఉన్నత విద్యాసంస్థల్లో ఒబిసిలకు 27 శాతం రిజర్వేషన్ల ప్రతిపాదనకు వ్యతిరేకంగా జరుగుతున్న అగ్రకుల విద్యార్థుల ఆందోళన 1990ల నాటి మండల్ వ్యతిరేక ఉద్యమం లాగ రూపంలో కనిపిస్తుంది. సారంలో నేటి ఆందోళన చాలా భిన్నమైనది. దీని నేపథ్యం గురించి మనం నిర్దిష్టంగా పరిశీలించాలి.

రూపంలో మండల్ వ్యతిరేక ఆందోళన, మళ్లీ నేటి మండల్ వ్యతిరేక అగ్రకుల విద్యార్థుల ఆందోళన ఒకేలా కనిపించటానికి వారు చేస్తున్న పాతవాదనలు, పాత ఆందోళనారూపాలు, మీడియా, కొందరి మేధావుల మద్దతు, సినీస్టార్లు, క్రికెటర్ల సంఘీభావం, క్రీమీలేయర్ వాదనలు, ఆర్థిక ప్రాతిపదిక ప్రతిపాదనలు లాంటివన్నీ కారణాలుగా చెప్పవచ్చు. అగ్రకుల విద్యార్థులు, వారికి వత్తాసు పలుకుతున్న మేధావులు, మీడియా ఒబిసిలకు రిజర్వేషన్లు ఇవ్వరాదని సూటిగా చెప్పరు. ఒబిసిలు సామాజికంగా వెనుకబడిన వారు కాదని, వారు సామాజిక అణచివేతకు, పేదరికానికి గురికాలేదని అగ్రకుల విద్యార్థులు, మేధావులు, ఇంగ్లీషు పత్రికలు, ఛానెల్స్ బహిరంగంగా చెప్పవు. చెప్పలేవు. ఒబిసిలు వెనుకబడి ఉన్నారని అంగీకరిస్తూనే, వారికి విద్యారంగంలో రిజర్వేషన్లు ఇవ్వరాదని అగ్రకులాల విద్యార్థులు వాదిస్తున్నారు. ఎందుకు ఇవ్వరాదంటే ఒబిసిలకు ప్రతిభ లేదని అంటున్నారు. పుస్తక పరిజ్ఞానం, బట్టీపట్టడంలో తమకు తామే సాటి అని, ఆ ప్రతిభ ఒబిసిలకు లేదని చెపుతున్నారు. లక్షలు చెల్లించి కార్పోరేట్ కాలేజీల్లో సీటు సంపాదించడమే తమ 'ప్రతిభ'గా అగ్రకుల విద్యార్థులు భావిస్తున్నారు. దళితుల్ని, బిసి కులాల ప్రజలని ఏళ్ల తరబడి పుస్తక జ్ఞానానికి, సంపదకు, అధికారానికి దూరంచేసిన అగ్రకులాలు తమ దోపిడీని, అణచివేతను, వివక్షను 'ప్రతిభ' సిద్ధాంతం పేరుతో సమర్థించుకుంటున్నారు. 'ప్రతిభ' ముసుగుతో అగ్రకుల విద్యార్థులు విద్యారంగంలో, ముఖ్యంగా వృత్తివిద్యారంగంలో తమ గుత్తాధిపత్యాన్ని కాపాడుకోవాలని తాపత్రయపడుతున్నారు. కార్పొరేట్ కాలేజీల్లో, ప్రైవేటు కోచింగ్‌సెంటర్లలో, ప్రైవేట్ ఇంజనీరింగ్, మెడికల్ కాలేజీల్లో అగ్రకుల విద్యార్థులు సాధించే 'మార్కులు' ఈ రోజు 'ప్రతిభ'గా చెప్పుకుంటున్నారు. ఈ 'ప్రతిభ'ను సాకుగా చూపి సమాజంలో విద్యకు, సంపదకు దూరం చేయబడిన వర్గాలను విద్యారంగంలోకి రానీయకుండా చేస్తున్నారు. ఈ అర్థంలో 'ప్రతిభ' అంటే అగ్రకుల ఆధిపత్యం మాత్రమే.

ఐఐటిలలో, ఐఐఎంలలో తమ గుత్తాధిపత్యాన్ని కాపాడుకోవటానికి మండల్ ఆందోళన సందర్భంగా చేసిన అనేక

వర్తమానం

అసమంజసమైన వాదనలే నేడు అగ్రకుల విద్యార్థులు చేస్తున్నారు. ఇంగ్లీషు మీడియా, కొందరు మేధావులు ఈ వాదనలనే వల్లె వేస్తున్నారు. రిజర్వేషన్ల వల్ల యువత చీలిపోతుందని, దేశం ముక్కలవుతుందని, ఒబిసి రిజర్వేషన్లు నిజమైన ఒబిసి పేదలకు అందవని, రిజర్వేషన్లు ఒక తరం వారికే ఇవ్వాలని, క్రీమీలేయర్ వర్గాన్ని రిజర్వేషన్లకు అనర్హులుగా ప్రకటించాలని రకరకాలుగా వాదనలు చేస్తున్నారు. ఈ వాదనలు ఒబిసి రిజర్వేషన్లు వ్యతిరేకించటానికి చేస్తున్నవి తప్ప దేశంపై, ఒబిసి పేదలపై ప్రేమతో కాదు. రిజర్వేషన్లపై పరిమితులు, క్రీమీలేయర్ లాంటి వాదనలన్నీ అగ్రకుల విద్యార్థులు రిజర్వేషన్లు అంగీకరించాక, ఈ పరిమితులు, షరతులపైనా, ఒబిసి పేదల గురించి మాట్లాడే నైతికహక్కు అగ్రకుల విద్యార్థులకు వస్తుంది. అప్పటిదాకా ఈ వాదనలు వారు మానుకుంటే మంచిది.

ఒబిసిలకు రిజర్వేషన్లు తప్ప ఆర్థికంగా సాయపడాలని, ప్రత్యేక పథకాలు రూపొందించాలని చేసే వాదనలు రిజర్వేషన్లు వ్యతిరేకించడానికి ఉపయోగించే సాకులు మాత్రమే.

అగ్రకులాల్లో పిల్లలు ఆందోళనకు దిగినప్పుడల్లా నిస్సిగ్గుగా తమ కులతత్వాన్ని, అహంకారాన్ని బయటపెట్టుకునే అగ్రకుల సామాజిక శాస్త్రవేత్తలు, క్రికెటర్లు, సినీ స్టార్లు, మీడియాసంస్థలు ఈసారి కూడా తమ పాత్ర నిర్వర్తించారు. ఎన్‌డి టివి, సిఎన్ఎన్-ఐబిఎన్, టైమ్స్ నవ్ లాంటి టీవీ ఛానల్స్, టైమ్స్ ఆఫ్ ఇండియా, ఇండియన్ ఎక్స్‌ప్రెస్ లాంటి ఇంగ్లీషు పత్రికలు, ఇండియన్ మెడికల్ అసోసియేషన్, జాతీయ విజ్ఞాన కమిషన్ సభ్యులు, కొందరు రాజకీయ నాయకులు బహిరంగంగానే తమ కులస్వభావాన్ని ప్రదర్శించారు. ఒబిసి రిజర్వేషన్లను కుంటిసాకులతో వ్యతిరేకించారు. ఈ రకంగా విభిన్నతంగాల్లోని అగ్రకులాలు ఏకం కావడం గతంలో మనం చూసినదే. అగ్రకుల విద్యార్థుల ఆందోళనారూపాలు (రోడ్లు ఊడ్వడం, రిక్షా లాగడం లాంటివి), వారి అగ్రకుల సంస్కృతికి, వారి అహంకారానికి అద్దం పడతాయి. వారికి మీడియా నుంచి, ఐఎంఏ, జాతీయ విజ్ఞాన కమిషన్ లాంటి ప్రభుత్వ సంస్థలనుంచి వచ్చే మద్దతు మన సమాజంలో అగ్రకుల ఆధిపత్యానికి సాక్ష్యాలుగా ఉంటాయి. తమ కులాల గుత్తాధిపత్యం వృత్తివిద్యారంగంలో కొనసాగించటానికే అగ్రకుల మెడికల్ విద్యార్థులు నిరాహారదీక్షలు, ఆందోళనలు చేస్తున్నారు.

**ప్రస్తుత రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళన**

అగ్రకుల మెడికోల ఆందోళన సారంలో భిన్నమైనది. ఈ ఆందోళనలో 90ల నాటికి మండల్ వ్యతిరేక ఆందోళన వాదనలే ప్రధానంగా ఉన్నప్పటికీ, నేటి ఆందోళనను నిర్దిష్టంగా పరిశీలించాలి.

ఉన్నతవిద్యారంగంలో ఒబిసిలకు 27 శాతం రిజర్వేషన్లు కల్పించడాన్ని వ్యతిరేకిస్తూ సాగుతున్న ఆందోళనకు ఢిల్లీలోనూ, ఇతర పట్టణాల్లోనూ మెడికల్ విద్యార్థులు నాయకత్వం వహిస్తున్నారు. వివిధ వృత్తివిద్యా సంస్థల నుంచి అగ్రకుల విద్యార్థులు ఎక్కువగా కదులుతున్నారు. మొట్టమొదటిసారిగా అత్యున్నత ఇంజనీరింగ్ విద్యాసంస్థలైన ఐఐటిలు, మేనేజ్‌మెంట్ సంస్థలైన ఐఐఎంలలో అగ్రకుల విద్యార్థులు అధికంగా ఉండడంపై చర్చ జరుగుతోంది. ఇంజనీరింగ్, మెడికల్ కాలేజీల్లో, యూనివర్సిటీల్లో, ఐఐటి, ఐఐఎంలలో, మొత్తంగా వృత్తి విద్యారంగంలో అగ్రకులాల ఆధిపత్యం ఉన్నట్టుగా స్పష్టమయింది. వృత్తివిద్యారంగంలో 27శాతం సీట్లు ఒబిసిలకు రిజర్వు చేస్తే ఈ రంగంలో తమ గుత్తాధిపత్యానికి దెబ్బ తగులుతుందని అగ్రకుల విద్యార్థులకు అర్థమయింది. అందుకే వారు రోడ్లమీదకొచ్చి తమ ఆధిపత్యాన్ని కాపాడుకునే ప్రయత్నం చేస్తున్నారు. ఒకపక్క 'ప్రతిభ'ను కాపాడాలని అంటూనే, మరోపక్క తమను తాము 'యూత్ ఫర్ ఈక్వాలిటీ' (సమానత్వం కోరే యువత)గా చెప్పుకుంటున్నారు. వృత్తివిద్యలో సమానత్వం కల్పించే ఒబిసి రిజర్వేషన్లు వ్యతిరేకించే యువత సమానత్వాన్ని కోరడం లేదు. తమ గుత్తాధిపత్యాన్ని 'ప్రతిభ' పేరుతో అగ్రకుల విద్యార్థులు సమర్థించుకుంటున్నారు. వాళ్లు చెప్పే 'ప్రతిభ' కు, సమానత్వానికి గల వైరుధ్యాన్ని కూడ పట్టించుకోరు. ఢిల్లీలో రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళనలో ముందున్న ఎఐఐఎంఎస్ మెడికల్ విద్యార్థుల ప్రతిభ గురించి వాస్తవాలు వెలుగులోకి వచ్చాయి. పిజి కోర్సులో తమ వద్ద గ్రాడ్యుయేషన్ చేసిన విద్యార్థులకు 33 శాతం రిజర్వేషన్లు అమలు చేస్తున్న ఎఐఐఎంఎస్ సంస్థ అడ్మిషన్ పద్ధతిని సుప్రీంకోర్టు తప్పుపట్టింది. ఆలిండియా ఎంట్రన్స్‌లో 14 లేదా 19 లేదా 22 శాతం మార్కులు వచ్చిన ఎఐఐఎంఎస్ గ్రాడ్యుయేట్స్‌కి పిజి కోర్సుల్లో సీట్లు రాగా ఇంతకంటే ఎక్కువ మార్కులు వచ్చిన ఎస్సీ ఎస్టీ విద్యార్థులకు వారి కోటాలో సీట్లు రాలేదు. రాజ్యాంగపరమైన ఎస్‌సి, ఎస్‌టి రిజర్వేషన్లను, మంచిమార్కులు తెచ్చుకున్న ఎస్‌సి, ఎస్‌టి విద్యార్థులు పట్టించుకోకుండా, సంస్థాపరమైన రిజర్వేషన్ల పేరుతో ఎఐఐఎంఎస్‌కి చెందినవారికే సీట్లు ఇవ్వడాన్ని 'ప్రతిభ' అందామా! లేక అగ్రకులాల గుత్తాధిపత్య విధానమందామా? ఈ ఎఐఐఎంఎస్ మెడికల్ విద్యార్థులు 'ప్రతిభ' పేరుతో గొంతు చించుకునేముందు తమ 'ప్రతిభ' గురించి ఒక్క క్షణం ఆలోచించాలి.

**బడా పెట్టుబడిదారులు రిజర్వేషన్లను ఎందుకు వ్యతిరేకిస్తున్నారు?**

ఈసారి రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళనలో కార్పొరేట్‌రంగ పెద్దలు బహిరంగంగా అగ్రకుల విద్యార్థుల్ని వెనకేసుకొచ్చారు. రాహుల్ బజాజ్, నారాయణమూర్తి, ప్రేమ్‌జీ లాంటి అనేకమంది పారిశ్రామికవేత్తలు ఒబిసి రిజర్వేషన్లను తీవ్రంగా వ్యతిరేకించారు. కార్పొరేట్ రంగ పెద్దలకు, వృత్తివిద్యకు చాలా దగ్గర సంబంధం ఉంది. అనేక వృత్తి విద్యాసంస్థలను కార్పొరేట్ రంగమే నిర్వహిస్తుంది. విప్రో నారాయణమూర్తి ప్రభుత్వరంగంలో అహ్మదాబాద్ ఐఐఎం గవర్నింగ్ కౌన్సిల్‌కి ఛైర్మన్‌గా ఉన్నారు. ఈ కార్పొరేట్ పెద్దలు విద్య ప్రైవేటీకరణకు, సామ్రాజ్యవాద అనుకూల విద్యకు మార్గం సుగమం చేసారు. అధికఫీజులు,

కాపిటేషన్ ఫీజు, ఎన్ఆర్ఐ కోటా లాంటి విధానాలు రూపొందించారు. ఈ కార్పొరేట్ పెద్దలే నేడు విద్యారంగంలో 'నాణ్యత' గురించి మాట్లాడుతున్నారు. డబ్బుతో 'సీట్లు కొనుక్కుని చదువుకుంటే వృత్తివిద్య 'నాణ్యత' తగ్గదు కాని ఒబిసిలకు సీట్లు రిజర్వు చేస్తే 'నాణ్యత' తగ్గుతుందని మాట్లాడుతున్నారు. ప్రపంచీకరణ వేళ్లూనుకుంటున్న నేపథ్యంలో దళితులు, బిసిలు, ప్రైవేటురంగంలో తమ వాటా గురించి అడుగుతున్నారు. కార్పొరేట్ రంగంలో రిజర్వేషన్లు కావాలని గత 2,3 ఏళ్లుగా ఒత్తిడి చేస్తున్నారు. ప్రభుత్వ సబ్సిడీలు, ప్రభుత్వ సహకారంతో ఎదుగుతున్న కార్పొరేట్ పరిశ్రమల్లో దళిత, బిసి లు వాటా అడిగితే పరిశ్రమాధిపతులు తట్టుకోలేకపోతున్నారు. నేడు ప్రభుత్వం ప్రతిపాదించిన ఒబిసి రిజర్వేషన్లు వృత్తివిద్యలో అగ్రకులాల గుత్తాధిపత్యాన్ని దెబ్బతీయడమే కాదు, పరిశ్రమల్లో ఒబిసిల ప్రవేశానికి, వారి ఒత్తిడికి అవకాశాలు పెరుగుతాయి. ఇది గమనించే సమాజంలో వివిధ రంగాల్లో ఏం జరుగుతుందో పట్టించుకోని కార్పొరేట్ పెద్దలు ఈరోజు అగ్రకుల విద్యార్థుల ఆందోళనను వెనకేసుకొస్తున్నారు. ప్రపంచీకరణ వల్ల పారిశ్రామిక రంగంలో, మొత్తంగా దేశ ఆర్థికవ్యవస్థపై ఆధిపత్యం సాధించిన బడా పెట్టుబడిదారులు సామాజికంగా వెనుకబడిన వర్గాలకు చదువుకునే అవకాశం, వృత్తివిద్యలో వాటా లేకుండా చేయాలని చూడడం వారి వర్గ, కుల ప్రయోజనాలు కాపాడుకోవడానికే.

**అగ్రకుల కార్పొరేట్ మీడియా సంస్థలు**

మీడియా సంస్థలు, ముఖ్యంగా టైమ్స్ ఆఫ్ ఇండియా, ఎన్‌డిటివి, సిఎన్ఎన్-ఐబిఎన్, టైమ్స్‌నవ్ లాంటి ఛానెల్స్ అగ్రకుల విద్యార్థుల్ని వెనకేసుకు రావడంలో కొత్త ఏమీ లేదు. మీడియాలో అగ్రకులాల ఆధిపత్యం, ముఖ్యంగా బ్రాహ్మణ కులాల ఆధిపత్యం ఉన్న సంగతి అందరికీ తెలుసు. అందుకే ఈ పత్రికల్లో, ఛానెల్స్‌లో రిపోర్టర్లు అగ్రకుల విద్యార్థులకంటే ఎక్కువ ఆవేశంతో, బాధతో, కోపంతో రిపోర్టు చేస్తూ కనిపిస్తారు. మీడియా సంస్థల్లో అగ్రకుల ఆధిపత్యంతో పాటు ప్రపంచీకరణ నేపథ్యంలో మీడియా సంస్థలు చాలా బలమైన కార్పొరేట్ సంస్థలుగా ఎదిగాయి. ఈ కార్పొరేట్ మీడియా బహుళజాతి సంస్థలు నయా సంపన్న వర్గాలకు, ఎగువ మధ్య తరగతి ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నాయి. దళితులకు, ఒబిసిలకు ఈ కార్పొరేట్ ప్రపంచంలో చదువుకునే హక్కు మాత్రమే కాదు, కనీసం మనుషులుగా బతికే పరిస్థితి లేదు.

**ఉత్తరాదినే రిజర్వేషన్ వ్యతిరేకత ఉధృతంగా ఎందుకు ఉంది?**

మరో ముఖ్యమైన అంశం - ఈసారి రిజర్వేషన్ ఆందోళన ప్రధానంగా ఉత్తర భారతదేశంలో కేంద్రీకృతమయింది. ముంబయి, బెంగుళూరు లాంటి పట్టణాల్లో కొంత అలజడి జరిగినా, ప్రధానంగా అగ్రకుల విద్యార్థుల ఆందోళన ఢిల్లీకి, ఉత్తరాది రాష్ట్రాలకు పరిమితమయింది. అయితే, చాలా ఉధృతంగా సాగింది. సాగుతూ ఉంది.

'90ల నాటి స్థితితో పోలిస్తే, ఈరోజు రిజర్వేషన్ల విధానానికి సాధికారత బాగా పెరిగింది. దక్షిణాది రాష్ట్రాల్లో ఒబిసి రిజర్వేషన్లు ఎప్పటినుంచో అమలవుతున్నాయి. మండల్ ఆందోళన తర్వాత కుల ప్రాతిపదికపై రిజర్వేషన్లు ఇవ్వడానికి స్థూలంగా దక్షిణాది రాష్ట్రాల్లో ఒక ఏకాభిప్రాయం ఏర్పడిందని చెప్పుకోవచ్చు. అందువల్లే దక్షిణాది రాష్ట్రాల్లో రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళన అంతంతమాత్రంగానే ఉంది. అయితే - ఉత్తరాది రాష్ట్రాల్లో అగ్రకుల భావజాలానికి, ఆధిపత్యానికి వ్యతిరేకంగా పోరాటాలు '80లనుంచి తీవ్రతరమయ్యాయి. 90లలో మండల్ సందర్భంగా ఒబిసిల ఉద్యమం, బీహార్, యుపిలలో బిసిల నాయకత్వంలో రాష్ట్రప్రభుత్వాలు ఏర్పడడం, సమాజ్‌వాదీ పార్టీ రాష్ట్రీయ జనతాదళ్, బిఎస్‌పి లాంటి పార్టీలు బలపడడం లాంటి అనేక పరిణామాల వల్ల ఒబిసిలు ఉత్తరాదిలో ఒక బలమైన రాజకీయ శక్తిగా ఎదిగారు. సాంప్రదాయకంగా ఆధిపత్య స్థానాల్లో ఉండి, అణచివేత, దౌర్జన్యాలు కొనసాగిస్తున్న అగ్రకుల పెత్తందార్లకు, విద్యా, ఉద్యోగరంగాల్లో, బ్యూరోక్రసీలో గుత్తాధిపత్యం వహిస్తున్న అగ్రకుల విద్యావంతులు రాజకీయశక్తిగా ఎదుగుతున్న ఒబిసిలతో వివిధరంగాల్లో వాటా పంచుకోవటానికి సిద్ధంగా లేరు. అయినా, కేంద్రప్రభుత్వ సర్వీసుల్లో 27 శాతం ఒబిసి రిజర్వేషన్లు అమలవుతున్నాయి. నేడు ఉన్నత విద్యారంగంలో 27 శాతం సీట్లు వదులుకోవాలంటే అగ్రకుల విద్యావంతులకి చాలా కష్టంగా ఉంది. అసెంబ్లీలో, పార్లమెంటులో, కేంద్రసర్వీసుల్లో ఒబిసిలు పెద్ద ఎత్తున ప్రవేశించారు. ఉత్తర భారతదేశంలో శాసనసభకు ఎన్నికైన ప్రజాప్రతినిధుల శాతం 1984లో 11 శాతం ఉండగా, అది 1996 నాటికి 25 శాతానికి పెరిగింది. అగ్రకుల ప్రజాప్రతినిధులు 1984లో 47 శాతం ఉండగా, వారి శాతం 1996 నాటికి 35 శాతానికి పడిపోయింది. హిందీబెల్ట్‌లో ఏ పార్టీ అధికారంలోకి వచ్చినా బిసి అభ్యర్థినే ముఖ్యమంత్రిగా ఎన్నుకుంటున్నారు. ఈ మార్పునే కొందరు సామాజిక శాస్త్రవేత్తలు 'నిశ్శబ్ద విప్లవం'గా పిలుస్తున్నారు. ఉత్తరాది రాష్ట్రాల్లో నిశ్శబ్దంగా అధికార బదిలీ జరుగుతోంది. రాజకీయ, ఉద్యోగ రంగాల్లో సాంప్రదాయ అగ్రకులాల ప్రాబల్యం తగ్గుతూ ఉంది. ఈ నేపథ్యంలో వచ్చిన ఒబిసిలకు వృత్తి విద్యారంగంలో, ఉన్నత విద్యాసంస్థల్లో 27 శాతం రిజర్వేషన్ల ప్రతిపాదనకు ఉత్తరాది రాష్ట్రాల అగ్రకుల విద్యార్థులు, వారి తరపున వారి తల్లిదండ్రులు, వ్యాపారులు అందరూ పెద్దఎత్తున ఆందోళనకు దిగారు. కనీసం ఉన్నత విద్యారంగంలో తమ ఆధిపత్యాన్ని కాపాడుకోవటానికే అగ్రకుల విద్యార్థులు ఈ ఆందోళన చేస్తున్నారు. వారి ఆందోళన దేశంలో బలపడిన అగ్రకుల భావజాలానికి, అగ్రకుల శక్తికి గుర్తుగా చూడరాదు. దేశంలో జరుగుతున్న ప్రజాస్వామికీకరణకు, కులవ్యవస్థను బలహీనపరిచే ఈ చర్యలకు అగ్రకులాల ఉక్రోషంగా మాత్రమే నేటి ఆందోళనని చూడాలి. రాబోయే రోజుల్లో మొత్తం సమాజంలోని వివిధరంగాలలో ఒబిసిలు ప్రవేశిస్తారని, తమను స్థానభ్రంశం చేస్తారనే భయంతోనే అగ్రకులాల విద్యార్థులు ఈ ఆందోళన చేస్తున్నారు.

## రాజకీయ పార్టీల వైఖరి

ఈసారి ఒబిసి రిజర్వేషన్ల ప్రతిపాదనపై రాజకీయపార్టీలన్నీ మౌనంగా ఉన్నాయి. అన్ని పార్టీలు బహిరంగంగా మద్దతు ప్రకటించాయి. గతంలో మండల్ కమిషన్ నివేదిక అమలుకు వ్యతిరేకంగా బిజెపి, కాంగ్రెస్‌పార్టీ తమ విద్యాసంఘాల్ని ఉసిగొల్పాయి. బహిరంగంగా తమ వ్యతిరేకతను తెలిపాయి. నేడు అన్ని పార్టీలు ఆమోదం తెలిపినట్టుగా మౌనంగా ఉండడం విశేషం. మొన్న డిసెంబర్‌లో పార్లమెంట్ 93వ రాజ్యాంగ సవరణ ద్వారా సామాజికంగా, విద్యాపరంగా వెనుకబడిన వర్గాలకు లేదా ఎస్‌సి, ఎస్‌టి లకు ప్రైవేటు, ఎయిడెడ్, అన్‌ఎయిడెడ్ విద్యాసంస్థల్లో రిజర్వేషన్లను కల్పించవచ్చనే క్లాజుని ఆమోదించింది. అన్ని రాజకీయపార్టీలు మద్దతు తెలిపాయి. ఆ రాజ్యాంగసవరణ బిల్లు ఆమోదం తర్వాత ఒబిసిలకు ఉన్నతవిద్యారంగంలో రిజర్వేషన్లు కల్పించడానికి మార్గం సుగమం అయ్యింది. పార్లమెంటులో రాజ్యాంగ సవరణకు ఆమోదం తెలిపిన పార్టీలకు నేడు గొంతు విప్పటానికి ఆ బిల్లు అడ్డువస్తుంది. అలాగే, అన్ని పార్టీల్లో ఒబిసిల ప్రాబల్యం బాగా పెరిగింది. ఒబిసిలు సమాజంలో 50 శాతం పైగా ఉన్నారు, మండల్ రిజర్వేషన్ల అమలు తర్వాత ఒక రాజకీయశక్తిగా, ఓటుబ్యాంకుగా ఎదిగారు. ఈ ఒబిసి వర్గాలకు వ్యతిరేకం చేసుకోవటానికి ఏ రాజకీయపార్టీ సిద్ధంగా లేదు. కొందరు బిజెపి నాయకులు, కాంగ్రెస్ ఎంపీలు అక్కడక్కడా అగ్రకుల విద్యార్థులతో గొంతు కలిపినా, మొత్తంమీద '90లతో పోలిస్తే మౌనంగా ఉన్నట్టే లెక్క.ఎస్‌సి, ఎస్‌టి, బిసి రిజర్వేషన్లకు పార్లమెంటులో ఏకాభిప్రాయం, రాజకీయపార్టీల ఆమోదాన్ని బట్టి చూస్తే సామాజిక న్యాయసూత్రాన్ని కాదనలేని స్థితి ఈరోజు ఉంది. అగ్రకుల విద్యార్థుల ఆందోళనను పట్టించుకోకుండా యుపిఏ ప్రభుత్వం రాబోయే జూన్ నుంచి ఒబిసి రిజర్వేషన్లు అమలు చేస్తామని ప్రకటించడం ఒకరకంగా గత 15 ఏళ్లుగా ఎస్‌సి, ఎస్‌టిలు, ఒబిసిలు చేసిన పోరాటాల ఫలితంగా రిజర్వేషన్లపై సమాజంలో వివిధవర్గాల మధ్య ఏర్పడిన ఏకాభిప్రాయం కారణం.

ఒబిసి రిజర్వేషన్లపై సిపిఎం పార్టీ వైఖరి గురించి ప్రత్యేకంగా ప్రస్తావించాలి. సిపిఎం పార్టీ ఒకపక్క ఒబిసి రిజర్వేషన్లు అమలు చేయాలని ప్రభుత్వంపై వత్తిడి తెస్తూనే, రిజర్వేషన్లపై, కులసమస్యపై తన పాత అవగాహనను పునరుద్ఘాటిస్తున్నది. 90ల నాటి మండల్ ఆందోళనల సందర్భంగా ఆర్థిక ప్రాతిపదికన రిజర్వేషన్లు కల్పించాలని సిపిఎం వాదించింది. నేడు ఆ అవగాహనను మార్చుకుని, కులప్రాతిపదికన రిజర్వేషన్లు అంగీకరిస్తున్నట్టు కనిపిస్తుంది. కానీ సిపిఎం పదే పదే లేవనెత్తుతున్న క్రీమీలేయర్ వాదన చూస్తే, ఆ పార్టీ కులప్రాతిపదికన రిజర్వేషన్లు అంగీకరించటానికి చాలా ఇబ్బంది పడుతున్నట్టు అర్థమవుతుంది. మొన్న సిపిఎం కార్యదర్శి ప్రకాష్‌కారత్ ప్రధానమంత్రిని కలిసి ఎస్‌సి, ఎస్‌టి, ఒబిసి రిజర్వేషన్లలో క్రీమీలేయర్‌ను రిజర్వేషన్ల పరిధి నుంచి తప్పించాలని కోరారు. ఈ క్రీమీలేయర్ వాదనను రిజర్వేషన్లు వ్యతిరేకించటానికి అగ్రకులాల విద్యార్థులు వాడుతున్నారు. ఆ వాదననే సిపిఎం పదే పదే చేయడం, ఒబిసిలకు మద్దతుగా తన సంఘాలను, శ్రేణుల్ని కదిలించకపోవడం, అగ్రకులాల విద్యార్థులకు సీట్లు పెంచాలని కోరడం - ఇవన్నీ పరిశీలిస్తే సిపిఎం వైఖరిపై అనేక అనుమానాలు రేకెత్తుతాయి. ఒక ఎన్నికలపార్టీగా ఓట్లదృష్టితో సిపిఎం ఆలోచిస్తున్నట్లు అర్థమవుతుంది. కులసమస్యపై స్పష్టత ఏర్పరచుకోకుండా, కేవలం పిడివాదపు వర్గదృష్టితో రిజర్వేషన్లు సమర్థించడం వల్ల సిపిఎం ఎస్‌సి, ఎస్‌టి, బిసి వర్గాలకు తెలియకుండానే నష్టం కలిగించే అవకాశం ఉంది.

సిపిఎం పార్టీ క్రీమీలేయర్ వాదన ముందుకు తేవడం వల్ల రిజర్వేషన్ విధానం యొక్క కులవ్యతిరేక స్వభావం దెబ్బతింటుంది. భూముల పంపకం, పరిశ్రమల్లో వాటా వల్ల ఎస్‌సి, ఎస్‌టి, ఒబిసిలు ఆర్థికంగా అభివృద్ధి చెందుతారు. కానీ ఆ చర్యల వల్ల పీడితకులాల్ని హీనంగా, తక్కువగా చూసే ధోరణులు - అంటరానితనం, వివక్ష, చిన్నచూపు, భౌతికదాడులు తగ్గవు. అగ్రకులాల గుత్తాధిపత్యానికి, బ్రాహ్మణీయ భావజాలానికి, అహంకారపూరిత ధోరణులకు వ్యతిరేకంగా మాట్లాడే చైతన్యం రిజర్వేషన్ విధానం వల్ల, రిజర్వేషన్ కోసం జరిగిన పోరాటాల వల్ల ఎస్‌సి, ఎస్‌టి, ఒబిసిలకు వచ్చింది. మన దేశంలో రిజర్వేషన్ అనుకూల ఉద్యమాల నుంచి, దళిత ఉద్యమాల నుంచి కులవ్యతిరేక చైతన్యం వచ్చింది. కులసమస్య పట్ల స్పష్టత వచ్చింది. ఈ అవగాహనను, చైతన్యాన్ని సిపిఎం సరిగ్గా విశ్లేషించుకోవాలి. ఒబిసిలలో పేదలకే రిజర్వేషన్లు చెందాలనడం వల్ల ఉన్నత విద్యాకోర్సులలో, క్లాస్ 1 ఉద్యోగాలకు అర్హత కలిగిన ఒబిసి అభ్యర్థులు దొరకరు. ఉన్నతశ్రేణి ఉద్యోగాల్లో బిసిల శాతం పెరగదు. అర్హులైన ఒబిసి అభ్యర్థులు లేరని ఉన్న పోస్టులన్నీ అగ్రకులాల అభ్యర్థులే తన్నుకుపోతారు. క్రీమీలేయర్ వాదన రిజర్వేషన్‌ను కుదించటానికి, క్రమంగా ఎత్తివేయడానికి, ఒసి పేదలను రిజర్వేషన్ పరిధిలోకి తేవటానికి, రిజర్వేషన్లను నీరుకార్చటానికి దోహదం చేస్తున్నది. కేంద్రప్రభుత్వ సర్వీసుల్లో 27శాతం ఒబిసి రిజర్వేషన్లు అమలులో క్రీమీలేయర్ పేరుతో తెచ్చిన ఆదాయపరిమితి బిసిలు ఉద్యోగాలు పొందటానికి అడ్డంకిగా తయారయ్యాయి. దక్షిణాది రాష్ట్రాల్లో అమలవుతున్నట్టుగా ఒబిసి రిజర్వేషన్లు ఎబిసిడిలుగా విభజిస్తే బిసి కులాల్లోని వివిధ పేద కులాలకు కూడా న్యాయం జరుగుతుంది.

## రిజర్వేషన్ల వల్ల అగ్రకుల ఆధిపత్యానికి గండి

రిజర్వేషన్ విధానాన్ని ఒబిసిలను ఆర్థికంగా అభివృద్ధి చేసే చర్యగా చూడడం సరికాదు. అలా చూస్తే, ఏ అభివృద్ధి పథకానికి రాని నిరసన, వ్యతిరేకత రిజర్వేషన్లకే ఎందుకొస్తుందో తెలియదు. అగ్రకులాల నుంచే ఈ నిరసన ఎందుకొస్తుందో అసలే అర్థంకాదు. కార్పొరేట్‌రంగం ఎందుకింత కలవరం చెందుతుందో అర్థం కాదు.

రిజర్వేషన్లు ఉద్యోగాలు కల్పించే స్కీముగా, అభివృద్ధి ఫలాలను సమంగా పేదలకు పంపిణీ చేసే కార్యక్రమంగా, పేదరిక నిర్మూలనాపథకంగా, సంపూర్ణ సమానత్వం సాధించే ప్రభుత్వవ్యూహంగా చాలామంది భావిస్తున్నారు. అగ్రకుల విద్యార్థులు, మేధావులు ఈ రకమైన వాదనలు, అభిప్రాయాలు ప్రచారం చేస్తున్నారు. సిపిఎం లాంటి వామపక్ష పార్టీలు, ఇతర రాజకీయపార్టీలు ఈ రకమైన వాదనలు ముందుకుతెస్తున్నారు. అందువల్లే రిజర్వేషన్ల వల్ల ఒబిసిలలో పేదలకు న్యాయం జరగదని అంటున్నారు. ఒబిసిలలో ఆర్థికంగా బలపడిన కొన్ని కులాలు రిజర్వేషన్లు మొత్తంగా వాడుకోవడం ఒబిసిలలో అంతరాలు మరింత పెరుగుతాయని ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. క్రీమీలేయర్ క్లాజుతో ఒబిసి, ఎస్సి, ఎస్టి లోని ధనికవర్గాన్ని రిజర్వేషన్ పరిధి నుంచి తప్పించాలని డిమాండ్ చేస్తున్నారు.

నిర్దిష్టంగా ఒబిసి రిజర్వేషన్‌ల గురించే మాట్లాడుకుంటే, కేంద్రప్రభుత్వ ఉద్యోగాల్లో 1980ల నాటికి ఒబిసిలు 12.55 శాతం మాత్రమే ఉన్నారు. ఎస్సి, ఎస్టిలు 18.72 శాతం ఉన్నారు. సుమారు 65 శాతం ఉద్యోగాల్లో అగ్రకులాలు అనుభవిస్తున్నారు. క్లాసు 1 ఉద్యోగాల్లో ఒబిసిలు 5 శాతం ఉన్నారు. ఎస్సి, ఎస్టిలు 1 శాతం కూడా లేరు. 90 శాతం క్లాసు 1 ఉద్యోగాల్ని అగ్రకులాలే అనుభవిస్తున్నారు. ఈ సందర్భంలోనే ఒబిసిలకు కేంద్రప్రభుత్వ సర్వీసుల్లో 27 శాతం రిజర్వేషన్లు కల్పించే ప్రతిపాదన విపి సింగ్ ప్రభుత్వం ముందుకు తెచ్చింది. ఈ ప్రతిపాదన ఒబిసిలను సామాజికంగా, ఆర్థికంగా అభివృద్ధి చేయటానికి ఉద్దేశించినది కాదు. ప్రభుత్వ విధాన నిర్ణయంలో కీలకపాత్ర వహించే బ్యూరోక్రసీ అధికార వ్యవస్థలో ఒబిసిలకు స్థానం కల్పించడమే ఒబిసి రిజర్వేషన్ల ప్రతిపాదన వెనుక ఉన్న ఉద్దేశ్యమని విపి సింగ్ స్పష్టం చేశారు. పాలనారంగం, విద్యావ్యవస్థలు అగ్రకులాల గుత్తాధిపత్యంలో ఉన్నాయి. ఒబిసిలకు పాలనారంగంలో, విద్యావ్యవస్థలో ప్రాతినిధ్యం కల్పించడం ద్వారా అరకొరగా ఉన్న ఉద్యోగాల్లో వారికి కొన్ని దొరుకుతాయి. ఒబిసిలలో కొందరు ఉన్నతాధికారులుగా, వివిధ హోదాల్లో ప్రభుత్వ ఉద్యోగులుగా ఎదుగుతారు. ఒబిసిలు తాము కూడా అధికారంలో, ఉద్యోగాల్లో వాటా పొందుతున్నామని భావించడానికి, రాజకీయంగా సంఘటితం కావడానికి రిజర్వేషన్లు దోహదపడతాయి. ఒక్కమాటలో చెప్పాలంటే విద్యా, ఉద్యోగరంగాల్లో అగ్రకులాల ఆధిపత్యాన్ని తగ్గించడమే ఒబిసి రిజర్వేషన్ల లక్ష్యం. రిజర్వేషన్లు ఒబిసిలకు కాని, ఎస్సి, ఎస్టిలకు కాని ప్రభుత్వ ఉద్యోగ, విద్యారంగాల్లో కొంత ప్రాతినిధ్యం కల్పించడానికి ఉపయోగపడతాయి. ఆ మేరకు రిజర్వేషన్లు కులవ్యవస్థను బలహీనపర్చడానికి, అగ్రకులాల ఆధిపత్యాన్ని తగ్గించటానికి ఉపయోగపడే పరిమితమైన సంక్షేమచర్య మాత్రమే. ఈరోజు అగ్రకులాలను ఇబ్బంది పెడుతున్నదీ ఈ అంశమే. అగ్రకులాధిపత్యాన్ని దెబ్బతీయడం వల్లే రిజర్వేషన్ల వ్యతిరేకత ఉద్యమం ఇంత తీవ్రంగా, ఒబిసిలను, ఎస్సి, ఎస్టిలను ప్రతిభలేనివారని, రోడ్లు ఊడ్వడానికి, రిక్షా లాగడానికి, చెప్పులు కుట్టడానికి తప్ప పనికిరాని వాళ్లని బ్రాహ్మణీయ అహంకారంతో నిందిస్తున్నది. రిజర్వేషన్లు ఏ మాత్రం ఈ అగ్రకుల అహంకారాన్ని, బ్రాహ్మణీయభావజాలాన్ని దెబ్బతీసినా ఆ మేరకు ఆ ప్రభావం ఎస్సి, ఎస్టి, ఒబిసిలు ఆత్మగౌరవంతో ముందుకుపోవడాన్ని, వివిధ రంగాలలో రాణించటానికి దోహదం చేస్తాయి. రిజర్వేషన్ల వల్ల సంపూర్ణ సమానత్వం రావాలని భావించటం, అలా రాకపోతే రిజర్వేషన్లు ఉండరాదనే వాదన కేవలం కులవ్యవస్థపై దాడిని సహించలేని అగ్రకులతత్వ వాదుల వ్యూహంలో భాగమే.

ఒబిసిలకు ఉన్నత విద్యారంగంలో రిజర్వేషన్లు కల్పించడాన్ని అగ్రకుల విద్యార్థులు, కార్పోరేట్ రంగం తీవ్రంగా వ్యతిరేకించటానికి అనేక కారణాలు ఉన్నాయి. గత కొన్ని సంవత్సరాలుగా ప్రైవేటురంగంలో రిజర్వేషన్లు కావాలని ఎస్సి, ఎస్టిలు డిమాండు చేస్తున్నారు. ప్రభుత్వం కూడా ఆ దిశగా ఆలోచిస్తున్నది. కార్పోరేట్‌రంగంలోని బడా పెట్టుబడిదారులు, ఐటి రంగ ప్రముఖులు ప్రైవేటురంగంలో రిజర్వేషన్ల ప్రతిపాదనను తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. 93వ రాజ్యాంగ సవరణ ద్వారా ప్రైవేటు విద్యాసంస్థలో రిజర్వేషన్లు కల్పించే వీలు కలిగింది. నేడు ఒబిసిలకు రిజర్వేషన్లు ఇస్తామని ప్రభుత్వం ప్రకటించింది. ఈ చర్యలు రాబోయే రోజుల్లో ప్రైవేటు పరిశ్రమల్లో రిజర్వేషన్లు కల్పించే అవకాశం ఉందని బడా పెట్టుబడిదారులు అర్థం చేసుకున్నారు. అందుకే అగ్రకుల విద్యార్థుల్ని వెనకేసుకొచ్చి, తమ మీడియా సంస్థల ద్వారా రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళనల్ని రెచ్చగొట్టి కార్పోరేట్ రంగ ప్రముఖులు ప్రభుత్వంపై పెద్ద ఒత్తిడి తెస్తున్నారు. మొత్తంగా రిజర్వేషన్లు, సబ్సిడీలు లేని స్వేచ్ఛా మార్కెట్, ఆర్థికవ్యవస్థ కోరుకునే కార్పోరేట్ రంగం ఒబిసి రిజర్వేషన్ల ప్రతిపాదనతో కలవరం చెందుతుంది.

**ముగింపు :**

రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళన ఉధృతం కాకపోయినా, ఆ ఆందోళన వెనుక బలమైన శక్తులున్నాయి కనుక ఒబిసి రిజర్వేషన్లు ఏదోరకంగా నీరు కార్చే అవకాశం ఉంది. ప్రభుత్వం ఇప్పటికే అగ్రకులాలకు సీట్లు పెంచుతామని ప్రకటించి, కొంతమేరకు అగ్రకులాల విద్యార్థుల ఆందోళనకు దిగివచ్చింది. పార్లమెంటు చట్టాన్ని, ప్రభుత్వ నిర్ణయాన్ని ప్రభావితం చేయగల వర్గాలు నడుపుతున్న రిజర్వేషన్ ఆందోళనకు దళిత, ఆదివాసీ, ఒబిసి ప్రజల సంఘటిత పోరాటమే అడ్డుకట్ట వేయగలదు.

భారతదేశంలో స్వేచ్ఛామార్కెట్ స్వేచ్ఛగా వేళ్లూనుకోవటానికి సాధ్యం కాదని పీడిత కులాల పోరాటాలు తెలియజేస్తాయి.❑

# సూక్ష్మ రుణ భారతం

కొణతం దిలీప్



స్వావలంబన, మహిళా సాధికారత అనే అందమైన ముసుగు వేసుకుని గత కొంతకాలంగా ఆంధ్రప్రదేశ్‌లో కార్యకలాపాలు నిర్వహిస్తున్న మైక్రోఫైనాన్స్ కంపెనీల అసలు రంగులు బైటపడుతున్నాయ్. ప్రపంచబ్యాంక్ ఎంతో ఆర్భాటంగా ప్రచారం చేసుకుంటున్న సరికొత్త 'పేదరిక నిర్మూలన చిట్కా'లో అసలు 'లబ్ధిదారులు' ఎవరో ఇప్పుడు అర్థం అవుతోంది. రుణం సూక్ష్మమైనా ఘనమైనా చివరికి మోసపోయేది బడుగు జీవులేనని, కాసులవర్షం కాబూలీవాలాలకేననీ మైక్రోఫైనాన్స్ కంపెనీల తాజా ఉదంతం తెలియజేస్తోంది.

వర్తమానం

**కథ మొదలైంది ఇక్కడ :**

1974లో బంగ్లాదేశ్ కరువుకోరల్లో చిక్కి విలవిల లాడుతున్నప్పుడు మహ్మద్ యూనుస్ అనే ప్రొఫెసర్‌కు మొదట ఈ సూక్ష్మరుణాల ఆలోచన వచ్చింది. తన చుట్టూ ఉన్న పేదవారిలో అత్యధికులకు చాలా కొద్దిమొత్తం డబ్బు అవసరాలు ఉన్నాయనీ, ఏదో విధంగా ఆ మొత్తం రుణంలా లభిస్తే వారి జీవితాలు బాగుపడతాయని అర్థం చేసుకున్నాడు ఈ ప్రొఫెసర్. తన వద్దనున్న కొద్దిపాటి సొమ్మును ఆ ప్రాంతంలోని 42 మందికి రుణంగా ఇచ్చాడు. ఆ ప్రయత్నం ఫలించింది. తొలివిజయం యూనుస్‌లో కొత్త ఆలోచనలకు బీజం వేసింది. ఫలితంగా 1976లో యూనుస్ పేదప్రజలకు చిన్నమొత్తాలు రుణాలుగా అందించేందుకు గ్రామీణ్‌బ్యాంక్‌ను స్థాపించారు.

మహిళలను స్వయం సహాయక బృందాలుగా ఏర్పరచి వారికి చిన్నమొత్తాలను రుణంగా ఇచ్చే గ్రామీణ్‌బ్యాంక్ ప్రయోగం విజయవంతమవడంతో ప్రపంచబ్యాంక్ ఈ కొత్త ఆలోచనను భుజాన వేసుకుంది. పేదరిక నిర్మూలనలో ఘోరంగా విఫలమైన ప్రపంచబ్యాంక్‌కు గ్రామీణ్ బ్యాంక్ ప్రయోగం చేతికందిన వరంలా దొరికింది. ఇంకేముంది చంద్రబాబు వంటి స్థానిక నాయకుల అండతో స్వయంసహాయక మహిళా బృందాలను ఏర్పరచి వారిని తమ ఎజెండా అమలుపరిచే పనిముట్లుగా వాడుకునే దుర్మార్గమైన ఎత్తుగడకు తెరలేపింది ప్రపంచబ్యాంక్.

**నిర్వీర్య సహకారం :**

గ్రామీణులకు అవసరమైన ఆర్థిక తోడ్పాటును అందించేందుకు స్వాతంత్ర్యం వచ్చిన తొలినాళ్లలోనే అప్పటి ప్రభుత్వం గట్టిచర్యలు చేపట్టింది. 1950ల్లోనే ఆల్ ఇండియా రూరల్ క్రెడిట్ సర్వే నివేదిక మేరకు సహకార సంఘాలలో ప్రభుత్వ భాగస్వామ్యం ఉండాలని నిర్ణయించింది మన కేంద్రప్రభుత్వం. 1969లో బ్యాంకులను జాతీయం చేశాక గ్రామీణులకు వివిధ రుణాలు అందజేసే ప్రక్రియ ఊపందుకుంది. అయితే ఈ బ్యాంకులు ఇచ్చే రుణాల్లో అధికశాతం వ్యవసాయ రంగానికే చేరాయి. ఇతర రంగాలకు వ్యవస్థీకృత రుణాల లభ్యత అంతంత మాత్రంగానే ఉంటూ వచ్చింది.

తొంభైయవ దశకం వచ్చేనరికి సహకార బ్యాంకుల్లో అధికశాతం నష్టాల ఊబిలో కూరుకుపోయాయి. సరళీకరణ, ప్రైవేటీకరణ జోరులో ప్రభుత్వం కూడా ఈ సహకార సంఘాలను, బ్యాంకులను పట్టించుకోవడం మానేసింది. సహకార వ్యవస్థ నిర్వీర్యమవడంతో గ్రామీణులకు రుణాలకోసం ప్రైవేటు ఫైనాన్స్ వ్యాపారులను ఆశ్రయించక తప్పని పరిస్థితి కల్పించబడింది. సరిగ్గా ఇటువంటి సమయంలోనే గ్రామీణ మహిళలను బృందాలుగా తయారుచేసి వారికి చిన్నమొత్తాలు రుణంగా ఇచ్చే, వారిచేత చిన్న మొత్తాలను పొదుపు చేయించే స్వయంసహాయక గ్రూపులపథకం (డ్వాక్రా) కేంద్రప్రభుత్వం మొదలుపెట్టింది. చంద్రబాబు చొరవ తీసుకుని తన హయాంలో ఈ స్వయంసహాయక గ్రూపులకు విపరీత ప్రచారం కల్పించాడు. ఎలక్షన్లలో కూడా డ్వాక్రా మహిళలను మంచి చేసుకుని గెలిచే ప్రయత్నం చేశాడు.

ఇప్పుడు వైయస్ రాజశేఖరరెడ్డి ప్రభుత్వం కూడా డ్వాక్రా బృందాలకు పావలా వడ్డీకే రుణాలు అందజేస్తున్నట్టు భారీగా ప్రచారం చేసుకుంటోంది. (ఇది పావలా కాదనీ, వాస్తవానికి రూపాయిపైనే వడ్డీగా వసూలు చేస్తున్నారని స్వయంసహాయక బృందాలవాళ్లు చెబుతున్నారు).

సూక్ష్మరుణాల పంపిణీలో ఆంధ్రప్రదేశ్ దేశంలోనే ప్రథమస్థానంలో ఉందివ్వాళ. రాష్ట్రంలో డెబ్బై లక్షల మంది మహిళలతో దాదాపు ఐదు లక్షల స్వయంసహాయక బృందాలు ఉన్నట్టు ఒక అంచనా.

**ప్రభుత్వ వర్సెస్ ప్రైవేటు మైక్రో ఫైనాన్స్ :**

మైక్రోఫైనాన్స్ రంగంలో గత కొద్ది సంవత్సరాలుగా జరుగుతున్న హడావిడి చూసిన కొన్ని ప్రైవేటు బ్యాంకులు, సంస్థలు ఇదో లాభసాటి వ్యవహారమని గ్రహించాయి. ఓవైపు పేదలకు ఎంతో సాయం చేస్తున్నట్టు, మహిళాసాధికారత కోసం పాటుపడుతున్నట్టు కనపడుతూనే పెట్టిన మదుపుపై భారీ లాభాలు వచ్చే అవకాశం ఉండటంతో సప్తసముద్రాలు దాటి వాణిజ్యబేహారులు ఆంధ్రప్రదేశ్‌లో వాలారు. గ్రామీణ ప్రాంతాల్లో చిన్న వ్యాపారస్తులకు, సామాన్యజనానికి అప్పులివ్వడానికి ఇన్నాళ్లూ విముఖత చూపిన వాణిజ్యబ్యాంకులు కూడా ప్రైవేటు మైక్రోఫైనాన్స్ సంస్థలకు 'రీఫైనాన్స్' చేయడానికి మాత్రం ఎక్కడలేని ఉత్సాహం చూపాయి. రిజర్వ్‌బ్యాంక్ వాణిజ్య బ్యాంకులను 'ప్రైమ్ లెండింగ్ రేట్' (12శాతం) కన్నా ఎక్కువ వడ్డీకి అప్పులివ్వనియ్యదు. అదే మైక్రోఫైనాన్స్ సంస్థలు స్వచ్ఛంద సేవ ముసుగులో సాలుసరి 24-36 శాతం వరకూ పేదప్రజల రక్తాన్ని పిండి మరీ వసూలు చేస్తున్నాయి. ఇందులో లాభాల రుచిమరిగే ఐసిఐసిఐ, ఎబిఎన్-ఆమ్రో వంటి బ్యాంకులు మైక్రోఫైనాన్స్ రంగంలో భారీ పెట్టుబడులు పెడుతున్నాయి. ఈ బ్యాంకుల నుండి టోకుగా డబ్బులు పట్టుకొచ్చి వాటిని పల్లెటూళ్లలో చిన్నాచితకా వ్యాపారాలు చేసుకునే ప్రజలకు మారువడ్డీకి తిప్పుతున్నాయి 'స్వచ్ఛంద' మైక్రోఫైనాన్స్ సంస్థలు.

**కథ అడ్డం తిరిగింది :**

గత రెండేళ్లుగా ప్రైవేట్ మైక్రోఫైనాన్స్ కంపెనీల ఆగడాలు మరీ శృతిమించాయి. అవసరానికి మించి అప్పులు బలవంతంగా అంటగట్టడం ఆనక వాటిని తిరిగి చెల్లించే వరకూ జులుం చేయడం రివాజుగా మారింది. పాతకాలపు వడ్డీవ్యాపారులు, ఫైనాన్స్ వ్యాపారుల్లాగే ఈ 'స్వచ్ఛంద' మైక్రోఫైనాన్స్ సంస్థల నిర్వాహకులు సిబ్బంది కూడా అప్పులు తీసుకుని కట్టలేకపోయిన వారిని రకరకాలుగా వేధించడం పరిపాటైపోయింది. కృష్ణా, గుంటూరు జిల్లాల్లో అయితే కొంతమంది మహిళలు చేసిన అప్పు తీర్చలేక ఆత్మహత్యలు చేసుకోవడం వంటి సంఘటనలు జరగడంతో ఈ విషయం వార్తాపత్రికల్లో ప్రముఖంగా చోటుచేసుకోవడం మొదలైంది. కృష్ణా, గుంటూరు జిల్లాల కలెక్టర్లు రంగంలోకి దిగి సభ్యులను వేధిస్తున్నారని ఆరోపణలు ఎదుర్కొంటున్న స్పందన, షేర్ మైక్రోఫిన్, అస్మిత వంటి సంస్థల కార్యాలయాలకు సీళ్లు వేయడంతో మైక్రోఫైనాన్స్‌సంస్థలు ఇన్నాళ్లూ చేస్తూ వచ్చిన ఆగడాలు వెలుగులోకి వస్తున్నాయి. బాధితులు తమకు జరిగిన చేదు అనుభవాలను ఇప్పుడు పత్రికలవారితో పంచుకుంటున్నారు.

**ఇది నియంత్రణ లేని ఫలితం :**

మైక్రో ఫైనాన్స్ రంగాన్ని సరైన నియంత్రణ లేకుండా వదిలివేయడం వల్లనే ఇవ్వాళ బడుగుల బతుకులతో కార్పొరేట్ కంపెనీలు చెలగాటమాడే పరిస్థితి తలెత్తింది. ప్రైవేట్ ఫైనాన్స్ కంపెనీలు, చిట్‌ఫండ్లు, నాన్‌బ్యాంకింగ్ ఫైనాన్స్ కంపెనీలు (ఎన్‌బిఎఫ్‌సి), కో-ఆపరేటివ్ బ్యాంకులు - ఇలా గత పదిహేను సంవత్సరాల్లో ఆర్థిక నేరగాళ్లు ఎప్పటికప్పుడు కొత్త ఎత్తులు వేస్తూ సామాన్యులను దోచుకుంటుంటే రక్షించాల్సిన ప్రభుత్వ యంత్రాంగం, రిజర్వ్‌బ్యాంక్ చేష్టలుడిగి చోద్యం చూస్తున్నాయి. ఇప్పుడు మైక్రోఫైనాన్స్ సంస్థల వంతు వచ్చింది.

ప్రజలకు ఏదో ఒరగబెడుతున్నామని అటు ప్రపంచబ్యాంక్ అధ్యక్షుడు ఉల్ఫోవిట్జ్ నుండి ఇటు రాహుల్‌గాంధీ వరకూ అందరూ వచ్చి గ్రామీణ మహిళలతో నాలుగు ముచ్చట్లు చెప్పి, వారితో గ్రూప్‌ఫోటో దిగి అర్థమైన ఉపన్యాసాలు ఇచ్చారు. తెరవెనుక జరుగుతున్న ప్రైవేట్ మైక్రోఫైనాన్స్ కంపెనీల దోపిడీపై మాత్రం ఎవరూ పెదవి విప్పలేదు.

అటు బ్యాంకులు కూడా సిగ్గూ- ఎగ్గూ లేకుండా పేదప్రజల దగ్గర వచ్చే కాసులకోసం కక్కుర్తి పడి ప్రైవేట్ మైక్రోఫైనాన్స్ సంస్థలకు గుడ్డిగా రీఫైనాన్స్ చేశాయి.

**చేతులు కాలాక.....**

ఇప్పుడు ఇంత రాద్ధాంతం జరిగి, ఎంతోమంది బలవన్మరణాల పాలై, ఇంకెందరో తమ జీవితాలను నాశనం చేసుకున్నాక రాష్ట్రప్రభుత్వం మేల్కొని మైక్రోఫైనాన్స్ కంపెనీలపై ఉక్కుపాదం మోపుతామని ప్రకటించింది. ప్రైవేటు మైక్రోఫైనాన్స్ సంస్థలు 12 శాతం వడ్డీకన్నా ఎక్కువ వసూలు చేయనీయమని రాష్ట్రముఖ్యమంత్రి ప్రకటించారు. మైక్రో సంస్థలకు ముకుతాడు వేసేందుకు త్వరలో కొత్తచట్టం తేనున్నామని కూడా ఆయన ప్రకటించారు. మైక్రోఫైనాన్స్ సంస్థలు మాత్రం తమ కంపెనీ వెబ్‌సైట్లలో ప్రభుత్వమే ఈ పరిస్థితికి కారణమనీ, పావలా వడ్డీ వంటి 'పాపులిస్టు స్కీములు' ప్రవేశపెట్టి ప్రభుత్వం ఇప్పుడిప్పుడే ఎదుగుతున్న మైక్రోఫైనాన్స్ 'పరిశ్రమ' ఉసురు తీస్తోందని ఆక్రోశిస్తున్నాయి. రాష్ట్రంలోని ఒక ప్రముఖ దినపత్రిక యజమానికిగల చిట్‌ఫండ్ వ్యాపారాన్ని తాము దెబ్బతీసినందుకే అతగాడు మైక్రోఫైనాన్స్ రంగంపై కత్తిగట్టాడని మరో కంపెనీ ప్రతినిధి వాపోతున్నాడు. అంబోతుల పోరులో లేగదూడలు మాత్రం నలిగిపోతున్నాయి. ❑

# ఇదీ మన గ్రామీణ భారత ముఖచిత్రం

వి.హనుమంతరావు

విశ్లేషణ

గత నెల సంచికలో (మే 2006) 'ఎజెండా మీదకు వచ్చిన తాగునీటి ప్రయివేటీకరణ' అనే శీర్షిక కింద దేశంలోని ఆరులక్షల గ్రామాల్లో తాగునీరు, పారిశుధ్యం గురించిన పరిస్థితి ఎలా వుందో వివరించడం జరిగింది. ఈ రెండూ గ్రామప్రజల కనీసావసరాలు. నీళ్లు లేక కొన్ని గ్రామాల్లో మా పిల్లనివ్వం అని అంటున్న విషయం పత్రికల్లో అపుడపుడు చదవుతున్నాం. అయితే గ్రామీణ జీవితం అంటే కేవలం మంచినీరు, పారిశుధ్యం మాత్రమే కాదుకదా. అనేక కనీసావసరాలున్నాయి. ఆకలి, దరిద్రం, ఉపాధి, భూమి, రహదారులు, విద్యుచ్ఛక్తి ఇలా ఎన్నో ఉన్నాయి. ఈ సౌకర్యాలన్నీ కల్పించినపుడే అది సమగ్ర గ్రామీణాభివృద్ధి అనిపించుకుంటుంది. అదే మా లక్ష్యం అంటూ కేంద్రం ఎన్నిరకాల పథకాలు ప్రవేశపెట్టిందో గత సంచికలో పేర్కొనటం జరిగింది. గత బిజెపి ప్రభుత్వహయాంలో ఇపుడు కాంగ్రెస్ పాలనలో ప్రవేశపెట్టిన మరికొన్ని పథకాల అమలు తీరుతెన్నులు పరిశీలిద్దాం. ఈ పరిశీలన మన ఊహల్లో ఆలోచనల్లో కాక, కేంద్ర ప్రభుత్వ గ్రామీణాభివృద్ధిశాఖ ఇచ్చిన సమాచారం, గణాంకాల ఆధారంగానే పరిశీలిద్దాం.

### స్వర్ణజయంతి గ్రామ స్వరోజ్‌గార్ యోజన

యువకులకు ఆర్థికసహాయం చేసి, వారి స్వయంకృషితో పేదరికపు రేఖ పైకి తీసుకొనిరావటం ఈ పథకం లక్ష్యం. 1999లో బిజెపి హయాంలో ప్రారంభించారు. తొమ్మిదోప్రణాళిక కాలంలో ఆర్థికలక్ష్యసాధన లక్ష్యంతో పోల్చుకుంటే 14 శాతం తక్కువే ఖర్చుచేసి ఏమి ఎంత సాధించదలచుకున్నారో లక్ష్యమే నిర్ణయించలేదు. కాని లెక్కలు చూస్తే, సహాయం అందిన స్వరోజ్‌గార్‌ల సంఖ్య 17.06 లక్షల నుంచి 9.37 లక్షలకు, ఎస్సీల సంఖ్య 5.75 లక్షల నుంచి 2.84 లక్షలకు, ఎస్టీలు 2.77 లక్షల నుంచి 1.44 లక్షలకు, స్త్రీల సంఖ్య 5.86 లక్షల నుంచి 3.86 లక్షలకు తగ్గిపోయింది. వారికిచ్చిన రుణసహాయానిదీ అదే ధోరణి.

(కోట్ల రు.)

| సంవత్సరం | రుణం లక్ష్యం | సాధన |
|---|---|---|
| 2002-03 | 2525 | 1184 |
| 2003-04 | 2129 | 1303 |
| 2004-05 | 2507 | 1658 |

అంటే 04-05లో దేశంలో ప్రతిగ్రామానికి నగటున మూడువందల రూపాయల సహాయం! ఈపాటి దానికేనా చెవులు చిల్లులు పడే ప్రచారం! సహాయం పొందిన లబ్దిదారులు ఎన్ని స్వయం సహాయ పథకాలు చేపట్టారు, ఎన్ని వారిని పేదరికపు రేఖ పైకి తీసుకొని వెళ్లాయి, ఎన్ని బోర్డులు తిప్పేశాయి అని ప్రశ్నలు అడక్కండి. ఈ సహాయ కార్యక్రమం సవ్యంగా అమలు జరుగుతుందా అని చూడడానికి స్థానిక కమిటీలు వేసి అందులో ఎమ్మెల్యేలు, ఎంపిలను సభ్యులుగా వేశారు. ఇంకేముంది? దొంగకు తాళంచెవి ఇచ్చినట్లే.

### సంపూర్ణ గ్రామీణ రోజ్‌గార్ యోజన

గ్రామీణ ప్రాంతాల్లో ఉపాధి కల్పన, ఆహారభద్రత, మౌలిక సౌకర్యాల కల్పన ఈ పథకం లక్ష్యాలు. లక్ష్యాలు పసందుగానే ఉన్నాయి. నెత్తిన తట్ట మోసేవాళ్లే ఈ పథకం కింద సహాయానికి అర్హులు. ఏం సాధించాలో, ఎంత సాధించాలో లక్ష్యాలే లేవు. పదవ ప్రణాళిక కేటాయింపు రు.30,000 కోట్లయితే మొదటి మూడేళ్లలోనే రు.24,000 పైగా విడుదల చేస్తే ఖర్చు అయింది 17 వేల కోట్లే. ప్రతి సంవత్సరం నూరుకోట్ల పనిదినాలు కల్పించాల్సి ఉండగా, మొదటి మూడేళ్లలో 300 కోట్లకు గాను 242.66 కోట్ల పనిదినాలే కల్పించారు.

### పనికి ఆహార పథకం

నవంబర్ 2004లో ప్రారంభమైన ఈ పథకం నూరురోజుల ఉపాధి గ్యారంటీ పథకంలో విలీనం చేయుబడింది. బాగా వెనుకబడిన 150 జిల్లాల్లో నీటి రక్షణ, కరువు వ్యతిరేక పనులు, భూమి అభివృద్ధి లక్ష్యాలు 2004-05లో కేంద్రం ఇచ్చిన నిధులు రు.2020 కోట్లు, 20 లక్షలటన్నుల తిండిగింజలు. కానీ ఖర్చయిన నిధులు రు.569 కోట్లు (28శాతం) మత్రమే. 20 లక్షల టన్నులకు గాను నాలుగు లక్షల టన్నులే రాష్ట్రాలు తీనుకున్నాయి. 2004-05లో ఈ పథకం అమలు కేవలం నాలుగు నెలలే, అలాగే తర్వాత సంవత్సరంలో 10 నెలలు మాత్రమే అమలు కావటం వల్ల పూర్తిగా ఖర్చు చేయలేకపోయి వుండవచ్చు. అయినా 2005-06లో రు.4500 కోట్లు కేటాయిస్తే పదినెలల్లో ఖర్చు అందులో నాలుగోవంతు (రు.1161కోట్లు) మాత్రమే ఖర్చుచేయటం చూస్తే పథకం అమలులో చిత్తశుద్ధి లేదని స్పష్టం.

### గ్రామీణగృహ నిర్మాణం

గ్రామాల్లో నిర్మించతలపెట్టిన గృహాలు, వాటికోసం చేసిన కేటాయింపులు, ఖర్చుల గణాంకాలు చూస్తే శబ్దకాలుష్యమే కనిపిస్తుంది, వినిపిస్తుంది. 10వ ప్రణాళికలో గృహాల కొరత 164 లక్షలుగా అంచనా వేశారు. 05-06 నుంచి 41 లక్షల ఇళ్ళు ప్రతి ఏటా నిర్మించాలని పథకం. అయితే ప్రస్తుతం చేసిన

కేటాయింపులు 15 లక్షల ఇళ్ల నిర్మాణానికి కూడా చాలవు. ప్రణాళికాసంఘం గృహనిర్మాణానికి అనుమతించిన కేటాయింపు రు.8603 కోట్లు మాత్రమే. అది కూడా వార్షిక ప్రణాళికలకు చేసిన కేటాయింపులు 'నిధుల నియంత్రణ' వల్ల ఖర్చుచేయలేక పోయారట. సహజంగానే ఇళ్ల నిర్మాణ లక్ష్యం చేరుకోలేకపోయారు. వాస్తవం చెప్పాలంటే 2002-03లో లక్ష్యాన్ని మించి 117.82 శాతం ఇళ్లు నిర్మిస్తే ఈ శాతం 05-06లో 64.23కు పడిపోయింది. ఈ ఏడాది ప్రణాళికలో రు.3842 కోట్లు కేటాయిస్తే బడ్జెట్‌లో దానికి రు.2920 కోట్లు మాత్రమే ఖర్చుచేయ సంకల్పించారు. ఈపాటి భాగోతానికి ఇందిరా ఆవాస్ యోజన అన్నారు, భారత్ నిర్మాణ్ అన్నారు. పథకాలు బారెడు, ఆచరణ మూరెడు.

**రోడ్లు బజారున పడ్డాయి**

రహదారుల నిర్మాణమేమో కాని, ప్రభుత్వం పరువు బజారున పడింది. గ్రామాల్లో రహదారులు స్వతంత్రం వచ్చినప్పటినుంచీ నిర్మిస్తూనే ఉన్నారు. కరువు, కాటకాలు వచ్చినపుడు పేదలకు ఉపాధి కల్పించడానికి రహదారులు నిర్మాణం చేపట్టడం సాధారణంగా జరిగే పని. రాష్ట్ర ప్రభుత్వాలు రహదారుల నిర్మాణానికి ప్రత్యేకశాఖలున్నాయి. వారూ రహదారులు వేస్తారు. అయినా ఎలాంటి రోడ్డు లేని గ్రామాలు 3.30 లక్షలున్నాయట. విచిత్రంగా ఉందే అనుకోకండి. ఇందులో రహస్యం ఆ శాఖ మంత్రులకు, కాంట్రాక్టర్లకు మాత్రమే తెలుసు. గ్రామాల్లో వేసిన రోడ్లన్నీ మరునటి వర్షానికి కొట్టుకొని పోతుంటాయి. కొన్ని సందర్భాల్లో అయితే, ఆ రోడ్లు కాగితాల మీదనే ఉంటాయి. అందుచేతనే వేయాల్సిన రహదారులు అలా ఉంటూనే ఉంటాయి. కాంట్రాక్టర్లకు చేతినిండా పని, పాలకుల జేబుల నిండా డబ్బు. 'ప్రధానమంత్రి గ్రామ్‌సడక్ యోజన' అని బిజెపి హయాంలో 2000లో నూటికి నూరుపాళ్లు కేంద్రప్రభుత్వ పథకంగా ప్రారంభించి మూడు సంవత్సరాల్లోగా వెయ్యి జనాభా పైగా ఉన్న గ్రామాలన్నిటికీ రహదారులు నిర్మించాలని 500 పైన జనాభా ఉన్న గ్రామాల్ని పదవ ప్రణాళికాంతంలోగా పూర్తిచేయాలని ఆదేశించారు. 3.30 లక్షల రహదారులు లేని గ్రామాలుండగా, వాటిలో 1.73 లక్షల గ్రామాలే ఈ పథకం కింద అర్హులని తేల్చారు. ఈ పని పూర్తిచేయడానికి ఒక లక్షా 30 వేల కోట్లు ఖర్చు అవుతాయని అంచనా. ఆ లక్ష్యాలు నెరవేరలేదని వేరే చెప్పాల్సిన పనిలేదనుకుంటా. ఎందుచేతనంటే ప్రస్తుత కాంగ్రెస్ ప్రభుత్వం 2005లో 'భారత్ నిర్మాణ్' అనే పేరుతో వేరే పథకం ప్రారంభించి 2009 నాటికి అన్నికాలాల్లోనూ నిలబడే రహదారులు అన్ని గ్రామాలకు వెయ్యాలని కొత్త నిర్ణయం చేసింది. అందుకోసం 48 వేల కోట్లు ఖర్చు అవుతుంది. డబ్బులేవి? పెట్రోలు వాహనదారుల మీద రోడ్‌సెస్ వేశారు. ఎడిబి నుంచి, ప్రపంచబ్యాంకు నుంచి అప్పులు తెస్తామన్నారు. అయినా ఇంకా 22 వేలకోట్లు లోటు ఉంటుందట. ఇక పనులెలా జరుగుతున్నాయి అని చూడబోతే 2005-06లో 46,643 రోడ్డుపనులు లక్ష్యానికి గాను డిసెంబరు 2005 నాటికి 29,564 పనులే పూర్తి అయ్యాయట. ఈ పనులకోసం అయ్యే ఖర్చు రు.25458 కోట్లు అంచనా కాగా, రు.15,589 కోట్లే విడుదల చేస్తే ఖర్చు అయింది రు.11820 కోట్లు మాత్రమే. అంటే సగం కూడా ఖర్చు కాలేదన్న మాట. గ్రామాల్లో రహదారులు నిర్మించడానిక్కూడా విదేశాల నుంచి అప్పులు తీసుకొని రావాల్సిన దుర్గతి పట్టించారీ పాలకులు.

**కపార్ట్**

ప్రజల్లో పనిచేసే వాలంటరీ సంస్థలకు, పేదరికపురేఖ కింద ఉన్నవారిని పైకి తీసుకొని రావడానికి ఈ సంస్థలకు ఆర్థిక సహాయం అందచేయటం ఈ పథకం లక్ష్యం. కేంద్ర పార్లమెంటు అంచనాల కమిటీ ఈ సంస్థ పనిచేసిన తీరును ఎడాపెడా వాయించేసింది. మొత్తం పని తీరు చూస్తే దారుణంగా విఫలమైంది. పేదరికపు రేఖ కింద ఉన్న లబ్ధిదారుల సంఖ్య 1998-99లో 4.49 లక్షలు కాగా 1999-00లో 31,250కు పడిపోయింది. లబ్ధిదారుల సంఖ్య ఒకో రాష్ట్రానికి ఒకోతీరుగా ఉంది. పశ్చిమబెంగాల్‌లో 24.92 లక్షలైతే, ఆంధ్రప్రదేశ్‌లో 9.40 లక్షలే. గోవాలో లబ్ధిదారులే లేరు. ఇంత తేడాలు ఎందుకొచ్చాయి? అని అంచనాలకమిటీ ఆందోళనను వ్యక్తం చేసింది. కేవలం నిధులు పంచిపెట్టే స్థాయికి దిగజారిందని కమిటీ పేర్కొంది. ఇప్పటికి రెండు దశాబ్దాలుగా ఈ పథకం పనిచేస్తున్నా, లక్ష్యమేమిటో ఇంతవరకూ నిర్వచించకపోవటం ఆశ్చర్యం కలిగిస్తుంది. 2002-03లో ఈ పథకం కింద రు.58.72 కోట్లు పంచిపెట్టినప్పటికీ ఖర్చు అయినట్లు రసీదులు రు.10.03 కోట్లకే వచ్చాయి." ప్రజల సహకార పథకం పేరుతో ఒక చిన్న పథకం కింద రు.16.26 కోట్లు మంజూరు చేస్తే, అందునుంచి విడుదల చేసింది రు.8.6 కోట్లు. 94 వాలంటరీ సంస్థలకు నిధులు ఇస్తే అందులో 44 సంస్థలను బ్లాక్‌లిస్ట్ చేయాల్సి వచ్చిందంటే ఈ సంస్థ పనితీరు ఎలా ఉందో అర్థం అవుతుంది.

గత పదేళ్లలో కేపార్ట్ పథకం కింద 129 ప్రాజెక్టులకు మాత్రమే రు.7.09 కోట్లు మంజూరు చేస్తే, విడుదల చేసింది రు.4.94 కోట్లు మాత్రమే.

అక్టోబరు 2004 నాటి వరకూ జరిగిన పనితీరు చూస్తే 294 వాలంటరీ సంస్థలు బ్లాక్‌లిస్ట్ అయ్యాయి. మరో 1400 సంస్థలకు సహాయన్ని నిలుపుదల జరిగింది. పదికోట్ల రూపాయలు అలాంటి సంస్థల నుంచి తిరిగి వసూలు చేయాల్సి ఉంది. 166 కేసుల్లో పోలీస్ స్టేషన్లో కేసులు దాఖలయ్యాయి. ఇన్ని సంవత్సరాలబట్టి అవకతవకలకు పాల్పడుతున్నా 2002-03లోనే పోలీసు కేసులు పెట్టడం ప్రారంభించారు. బ్లాక్‌లిస్ట్ చేసిన సంస్థలకు నిధులందచేసిన అధికారులు 50 మంది వుంటే, వారి మీద చర్య తీసుకోకుండా కేవలం సెన్సూర్ చేయటం తోనే సరిపెట్టారు.

# ఎడిబి ఎవరి అభివృద్ధి బ్యాంకు?

ఎస్.వీరయ్య

వ్యాఖ్య

ఆసియా డెవలప్‌మెంట్ బ్యాంకు గవర్నర్ల వార్షిక సమీక్షా సమావేశాలు సందర్భంగా రాష్ట్రవ్యాప్తంగా నిరసనధ్వనులు వినిపించాయి. ఇందుకు కొందరు ఆశ్చర్యపోయారు. అనేక సందేహాలు వెలిబుచ్చారు. అనేక ప్రశ్నలు ముందుకు తెచ్చారు.

- ప్రపంచబ్యాంకు, ఎడిబి వంటి అంతర్జాతీయ ఆర్థిక సంస్థల నుండి అప్పులు తీసుకోవటమే నేరమా?
- బలహీన దేశాలన్నీ కలిసి ఏర్పాటుచేసుకున్న సంస్థ ఎడిబి, దానినెందుకు వ్యతిరేకించాలి?
- సునామీ లాంటి ప్రకృతి వైపరీత్యాల సందర్భంగా తిరిగి చెల్లించనవసరం లేని సహాయం చేసింది ఎడిబి. అలాంటి సంస్థ పట్ల నిరసనలేమిటి?
- అభివృద్ధికి డబ్బు అవసరం. మరో ప్రత్యామ్నాయం లేనప్పుడు తీసుకుంటే తప్పేమిటి?
- ఎడిబి లక్ష్యాలు, మన ప్రయోజనాలు ఒకటే అయినపుడు అప్పు తీసుకోవటంలో తప్పేమిటి?

ఇలాంటివే ఇంకా ఎన్నో ప్రశ్నలు. రాష్ట్రప్రజలకు ప్రపంచబ్యాంకు గురించి తెలుసు కానీ ఎడిబి గురించి తెలియదు. అనేక బ్యాంకుల లాగే ఇదీ ఒక బ్యాంకు అనుకుంటున్నారు. పై ప్రశ్నలు వేస్తున్నవారు మేధావులు! ఈ ప్రశ్నలకు సమాధానాలు వారికి తెలియకపోవటం (లేదా తెలిసినా కప్పిపుచ్చటం) విచారకరం. జార్జిబుష్ పర్యటన సందర్భంగా నిరసనలను వ్యతిరేకించిన వారంతా ఇప్పుడు ఎడిబి పట్ల నిరసనను వ్యతిరేకించటం యాధృచ్ఛికం ఏమీ కాదు. పైగా అది సహజమే! ఏ గూటిపక్షులు ఆ పాటే పాడుతాయి కదా!

### ఎడిబి వద్ద అప్పు తేవటమే నేరమా?

అప్పు తేవటమే నేరమని గానీ, ప్రపంచబ్యాకు, ఎడిబి వంటి సంస్థల దగ్గర అప్పు తేవటమే నేరమని గానీ చెప్పటం లేదు. అప్పు చేయకుండా ఏ ప్రభుత్వమూ నడవదు. అప్పు ఎవరి దగ్గర తెస్తున్నావనే దానికన్నా, ఎలాంటి షరతులతో కూడిన అప్పు తెస్తున్నావన్నది అసలు సమస్య. ఒప్పందంలో, అప్పు తిరిగి చెల్లించాలనే దానికి సంబంధించిన క్లాజులుండటం సహజం. కానీ రాజ్యం పరిధిలోని విధానాలలో జోక్యం చేసుకొనే విధంగా షరతులుండటమే ప్రమాదకరం. ప్రపంచబ్యాంకు ఐఎంఎఫ్, ఎడిబి ఏదైనా సరే, సాధారణ అప్పులిచ్చినంత కాలం ఇవి చర్చనీయాంశాలు కాలేదు. షరతులతో కూడిన రెండవరకం అప్పుల విషయంలోనే ఆందోళన ప్రారంభమైంది.

ఎడిబిని, బలహీన దేశాలన్నీ కలిసి ఏర్పాటుచేసుకున్న ఆర్థికసంస్థగా కొందరు ఆర్థికవేత్తలు నమ్మబలుకుతున్నారు. ఇది నిజం కాదు. పెట్టుబడుల రీత్యా గానీ, ఓటింగ్ హక్కుల రీత్యా గానీ అమెరికా, జపాన్‌లు ఆధిపత్యస్థానంలో ఉన్నాయన్న విషయం జగమెరిగిన సత్యం. ప్రపంచబ్యాంకు, ఐఎంఎఫ్, ఎడిబిలు ఒకే లక్ష్యంతో పనిచేస్తున్న మూడు వేర్వేరు సంస్థలు. పని విభజనతో పనిచేస్తున్నాయి. వీటి ఉన్నతస్థానాలు కూడా పంచుకున్నారు. ప్రపంచబ్యాంకు అధినేతగా అమెరికా ప్రతినిధి ఉంటారు. ఐఎంఎఫ్ అధినేత ఐరోపా నుండి, ఎడిబి అధినేత జపాన్ నుండి ఉంటారు. హైదరాబాద్ ఎడిబి సమావేశాలలో అమెరికా ప్రతినిధి ఉపన్యాసంలో ఆధిపత్య ధోరణి స్పష్టంగా బోధపడుతుంది. ఎడిబి ఏమి చేయాలో, ఎలా వ్యవహరించాలో ఆదేశపూరితంగా మాట్లాడారు. ఇతర సభ్యదేశాల ప్రతినిధుల, చివరకు జపాన్‌తో సహా, ధోరణికి భిన్నంగా ఆయన ఉపన్యాసం సాగిన విషయం అందరికీ తెల్సిందే. పేరుకే ఆసియా డెవలప్‌మెంట్ బ్యాంకు. ఆచరణలో ఆధిపత్యమంతా అమెరికా డెవలప్‌మెంట్‌దే!

మన ప్రయోజనాలు, వాటి లక్ష్యాలు ఒకటే అయినప్పుడు వాటి దగ్గర అప్పు తీసుకుంటే తప్పేమిటన్నది మరో వాదన. అసలీ ఇద్దరి ప్రయోజనాలు ఒక్కటే ఎలా అవుతాయి? ఎడిబిని అలా ఉంచుదాం. సాధారణ వడ్డీ వ్యాపారి ప్రయోజనం, అప్పు పుచ్చుకునే వారి ప్రయోజనం ఒక్కటే అవుతుందా? అప్పు ఇచ్చే వారి లక్ష్యం, పుచ్చుకునే వారి లక్ష్యం ఎప్పుడూ ఒక్కటే ఉండదు. వడ్డీ లాభం కోసం అప్పు ఇచ్చినవాడు, వడ్డీ చెల్లింపుల గురించి, అసలు చెల్లింపుల గురించి ఆలోచించడాన్ని తప్పుబట్టలేము. ఆ పేరుతో నా ఇంటిమీద పెత్తనం చెలాయిస్తాననప్పుడే సమస్య

---

పావులిన్నట్ల పథకాల పనితీరు ఇదీ. ఈ పథకాలు పుంఖానుపుంఖాలుగా స్వతంత్రం వచ్చినప్పటి నుంచీ ప్రకటిస్తూనే ఉన్నారు. అమలు జరుపుతూనే ఉన్నారు. ఇలా పథకాలు ప్రకటించటంలో రాజకీయ నాయకులకు బోలెడన్ని నిధులు సమకూరుతున్నాయి. ప్రజలకు రాజీవ్‌గాంధీ అన్నట్లు 15 శాతం మాత్రమే ముడుతున్నాయి. జరిగిన పని గురించి కాకులెక్కలు ప్రకటించి జనాన్ని భ్రమల్లో పెడుతున్నారు. ఇలాంటి వివరాలన్నీ ఉండే ప్రభుత్వ ప్రచురణలు, ఎవరైతే నిధులు భోంచేస్తారో వారి వరకే చేరుతున్నాయి. ❑

తలెత్తేది. ఈ సంస్థలు, బహుళజాతి సంస్థల, సామ్రాజ్యవాద ప్రయోజనాల కోసం, ప్రపంచీకరణ పేరుతో, మన విధానాలను తామే నిర్ణయించే ప్రయత్నం చేస్తున్నాయి. అందుకవసరమైన షరతులు విధిస్తున్నాయి. ఇదీ అసలు సమస్య.

**ఎడిబి వ్యూహం**

"అభివృద్ధి, ఉపాధి కల్పన, పేదరికం నిర్మూలన, మౌలిక సదుపాయాల కల్పనలో అడ్డంకులు తొలగించటం, సుపరిపాలన అందించటం" ఇవీ ఎడిబి లక్ష్యాలుగా వల్లించే సూక్తులు. ఎడిబి అప్పులు సద్వినియోగం అవుతున్నాయో లేదో తానే స్వయంగా పర్యవేక్షణ చేస్తుందట! అందుకోసం విధానాల ప్రాతిపదిక మీద మాత్రమే (పాలసీ బేస్‌డ్ లెండింగ్) అప్పులిస్తుంది. ప్రైవేటీకరణ ద్వారా మాత్రమే ఈ అభివృద్ధి సాధ్యపడుతుందని నిర్దేశిస్తున్నది. విద్యుత్తు, ప్రాజెక్టులు (ఎన్రాన్ లాంటివి), డ్యామ్‌లు (పోలవరం వంటివి), పోర్టులు (గంగవరం వంటివి) తదితర ప్రాజెక్టులకు అప్పులిస్తారు. ఇలాంటి ప్రాజెక్టుల పరిణామాలు ఇప్పటికే మనం చూస్తున్నాం.

ఎడిబి అప్పు పొందిన దేశాలను, ప్రజోపయోగ పెట్టుబడులు తగ్గించమని, ప్రత్యక్ష, పరోక్ష సబ్సిడీలకు క్రమంగా తిలోదకాలివ్వాలని, వేతనాల ఖర్చు తగ్గించాలని, ప్రభుత్వరంగ సంస్థలకు సహాయపడరాదని, పౌరసేవల రంగాన్ని పూర్తిగా ప్రైవేటీకరించేందుకు అనువైన పరిస్థితులు సమకూర్చాలని షరతులు విధిస్తుంది.

ఈ అప్పుతో నడిచే ప్రాజెక్టుల విషయంలో ఎడిబి సూచించే జాబితా నుండి భారీ ఫీజులతో, కన్సల్‌టెంట్లను నియమించాలి. కాంట్రాక్టులు, కొనుగోళ్ల మీద ఎడిబిదే ఆధిపత్యం. ఇప్పటివరకు ఎడిబి రుణాలు పొందిన దేశాల నుండి కాంట్రాక్టులు పొందిన వారిలో అమెరికా బహుళజాతి సంస్థలదే ప్రథమస్థానం. తర్వాత జపాన్, బ్రిటన్ తదితర దేశాలున్నాయి. నీరు తదితర సహజ వనరులను సైతం సరుకులుగా మార్చివేసి, యూజర్‌ఛార్జీలు విధించటం ద్వారా ఆదాయవనరులుగా మార్చుతున్నారు. ఇక కొనగలిగిన వాడికే సేవలు, సౌకర్యాలు. నష్టాలంగా పెట్టుబడిదారులకు భూమి, నీరు, విద్యుత్తు చవకగా అందించటం, మానవ వనరులు అందించటం, ఇందుకనుగుణంగా చట్టాలు సవరించటం ఎడిబి విధానం. ఈ అప్పులతో నిర్మించే ప్రాజెక్టులకు మనదేశ చట్టాలు, కోర్టు తీర్పులు వర్తించవు. అంతా విదేశీ ఆధిపత్యమే. నష్టపోయిన ప్రజలు పరిహారం కోరే హక్కు కూడా కోల్పోతున్నారు. షరతుల పర్యవసానాలకివి కొన్ని మచ్చుతునకలు. షరతులు పెడితే తప్పేమిటని ప్రశ్నించేవారూ ఉన్నారు. వారికి ఈ దేశం, రాష్ట్ర ప్రయోజనాలకన్నా వేరే ప్రయోజనాలు ఉండి ఉండవచ్చు.

ప్రైవేటీకరణ విధానాలవైపు మరలటం ఏ దేశానికైనా పెద్ద సవాలేననీ సర్దుబాటు ఖర్చులుంటాయనీ, ఇలాంటి సందర్భాలలో ఆదుకుంటానని ఎడిబి భరోసా ఇస్తుంది. ఈ విధానాలవల్ల సామాజిక ఒడిదొడుకులు వస్తాయని వీరికి తెలుసు. అయినా వీరి ప్రయోజనాలు వేరు. పరిపాలన గురించి ఎడిబి ప్రచురించిన విధానపత్రంలో "పరిపాలన అంటే రకరకాల వారికి రకరకాలుగా అర్థమవుతుంది" అని పేర్కొన్నారు. నిజమే కదా. గతంలో చంద్రబాబు పాలనలో టిడిపి ప్రభుత్వానికి సుపరిపాలనగా కనిపించిన పాలన ప్రజలపట్ల శాపంగా పరిణమించలేదా? ఎడిబికి, ప్రపంచబ్యాంకుకు సుపరిపాలనగా కనిపించే పాలనే సాధారణ ప్రజలకు రాక్షస పాలనగా కనిపించవచ్చు. వివిధ రంగాలకు వీరిచ్చే అప్పు ఫలాలు ప్రైవేటు పెట్టుబడిదారుకు, భారాలు మాత్రం ప్రజలకు. ఇదే 'సుపరిపాలన' సారాంశం. ఇవి దేశాలను ప్రజలుగా చూడవు. ప్రజలను పౌరులుగాను, మనుషులుగాను చూడవు. వీరి దగ్గర అప్పు తీసుకున్న దేశాలను వీరు ఎకనామిక్ డెవలప్‌మెంట్ మేనేజర్స్‌గా పిలుస్తారు. ప్రజలను పౌరులుగా అంగీకరిస్తే వారి ఆర్థిక, సామాజిక, సాంఘిక, రాజకీయ తదితర అవసరాల గురించి శ్రద్ధ వహించాలి. అవి వీరికనవసరం. సరుకులు అమ్ముకోవటం, లాభం సంపాదించటమే వీరి లక్ష్యం. అందుకే ప్రజలను పౌరులుగా, మనుషులుగా కాకుండా వీరు వినిమయదార్లుగా మాత్రమే చూస్తారు. ఇందుకవసరమైన సిద్ధాంతాలన్నీ గుప్పిస్తారు.

కొంతమంది అమాయకంగా, ఎడిబికి డబ్బు మిగుల్చుకోవాలన్న తపన లేదనీ, సునామీ లాంటి విపత్తుల సందర్భంగా తిరిగి చెల్లించనవసరం లేకుండా సహాయపడిందనీ, ఇలాంటి ఎడిబి పట్ల నిరసన తెలుపటమేమిటనీ ప్రశ్నిస్తున్నారు. అదే ఎడిబి వంటి సంస్థల ప్రత్యేకత. అనేక వడ్డీ వ్యాపారుల లాగా వడ్డీ లాభం పొందటం వీరి ప్రధాన లక్ష్యం కాదు. ఇంతకన్నా మించిన రాజకీయ లక్ష్యం ఉన్నది వీరికి. ఆయా దేశాలను, అమెరికా ప్రయోజనాలకనుగుణంగా లోబరుచుకోవటం ప్రధానం. అందుకే ఉదార సంస్థలుగా పేరు కూడా వీరికి అవసరమే!

మరో ప్రత్యామ్నాయం లేనప్పుడు వీరి అప్పు తప్పదు కదా అంటున్నారు. ప్రత్యామ్నాయం లేక కాదు, పాలకులకు అలాంటి ఆలోచన లేకనే ఇలా జరుగుతున్నది. మన బ్యాంకుల దగ్గర అప్పు తీసుకునేవారు లేక డబ్బు మూల్గుతున్నది. తన చేతుల్లో ఉన్న లక్ష కోట్లకు పైగా పిఎఫ్, పెన్షన్ నిధులను షేర్ మార్కెట్ వైపు తరలిస్తూ, పాలకులు అప్పు కోసం ఈ సంస్థలవైపు చూస్తున్నారు. చిన్నమొత్తాల పొదుపు నిధులు కూడా రాష్ట్రాలకు అందుబాటులో లేకుండా చేసి, ఇలాంటి సంస్థలవైపు కేంద్రం బలవంతంగా నెడుతున్నది.

మన ప్రజల ప్రయోజనాలు, ఎడిబి లక్ష్యాలు ఒక్కటి ఎప్పుడూ కాజాలవు. ప్రస్తుతం మనం పాలకుల లక్ష్యం గానీ, ఎడిబి లక్ష్యం గానీ ఒక్కటే. ప్రతిదీ ప్రైవేటుపరం చేయటమే. అందుకే ఈ వెంపర్లాట. నిజంగా చిత్తశుద్ధి ఉంటే, షరతుల్లేని అప్పులైతేనే తీసుకుంటామని తెగేసి చెప్పవచ్చు. ఎవరికీ ఇవ్వకుండా, ఏ వడ్డీ వ్యాపారీ, ఏ ఆర్థికసంస్థా నిధులు తన దగ్గర ఉంచుకోవటం ఎక్కువకాలం సాధ్యపడదు. 102 కోట్ల జనాభా గల దేశం గట్టిగా

# ప్రపంచీకరణ : మన వ్యవసాయరంగం - ఒక పరిశీలన

**కూరపాటి వెంకటనారాయణ,**

**కె.వీరస్వామి**

**విశ్లేషణ**

మన ఆర్థిక వ్యవస్థను స్థూలంగా పరిశీలిస్తే గణనీయమైన అభివృద్ధిని సాధించామని ఒప్పుకోక తప్పదు. కాని, ఈ అభివృద్ధి కేవలం పారిశ్రామిక, సేవల రంగాలకే పరిమితమైందని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు. పారిశ్రామిక, సేవల రంగాలలో దేశంలోని 38 శాతం శ్రామికులు తమ సేవలు అందిస్తూ, 78 శాతం జాతీయాదాయాన్ని పంచుకొంటున్నారు. ఇక మిగతా 62 శాతం శ్రామికులు వ్యవసాయరంగంలోనే శ్రమిస్తూ కేవలం 22 శాతం జాతీయాదాయాన్ని పొందగలుగుతున్నారు. స్వాతంత్ర్యం సాధించిన నాటి నుండి ఇప్పటివరకు మన వ్యవసాయ ఉత్పత్తులు నాలుగురెట్లకు మించి ఉత్పత్తి జరుగుతున్నవి. కాని వ్యవసాయాన్నే నమ్ముకొని దేశానికి తిండి పెట్టే రైతన్నలు కంటతడి పెట్టి పట్టణాలకు వలసబాట పట్టడం అత్యంత దురదృష్టకరం. మనదేశంలో వ్యవసాయరంగానికి ఈ పరిస్థితులు దాపురించడానికి దారితీసిన పరిస్థితులను, కారణాలను విశ్లేషించి తగు నివారణోపాయాలను వెతకవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

1950 నుండి 1990 మధ్యకాలంలో వ్యవసాయ వార్షిక వృద్ధిరేటు 3.2 శాతం ఉండగా 1990-2004 కాలంలో 1 శాతానికి తగ్గిపోయింది. గత నాలుగైదు సంవత్సరాల నుండి పూర్తిగా జీరో వృద్ధిరేటుకు దిగజారింది. ముఖ్యంగా ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ నేపథ్యంలో చోటుచేసుకుంటున్న వివిధ మార్పులు, పరిణామాలు వ్యవసాయరంగాన్ని దుష్పరిణామాలకు గురిచేస్తున్నవని నిపుణులు ఆందోళన చెందుతున్నారు. 1991 నుండి ప్రభుత్వం వ్యవసాయరంగానికి కల్పించే సబ్సిడీలను, ప్రోత్సాహకాలను విరమించింది. అదేవిధంగా ఈ రంగానికి ప్రభుత్వం సమకూర్చే పెట్టుబడులు కూడా నిలిపివేసింది. ప్రణాళికల ద్వారా వ్యవసాయరంగానికి కేటాయిస్తున్న బడ్జెట్ ఏనాడు కూడా ఒక శాతనికి మించలేదు. ప్రపంచబ్యాంకు ఆదేశాల మేరకే వ్యవసాయరంగానికిచ్చే సబ్సిడీలు విరమించింది మన ప్రభుత్వం. కాని అమెరికా ప్రభుత్వం మాత్రం ఒక్క పత్తిరైతులకే 4 బిలియన్ల డాలర్ల సబ్సిడీ ఇస్తున్న విషయం మన పాలకులకు తెలియనిది కాదు. సాగునీరు, పరపతి, మార్కెటింగ్, నకిలీ విత్తనాలు, నకిలీ ఎరువులు, నకిలీ క్రిమిసంహారక మందులు మొదలగు సమస్యలతో వ్యవసాయరంగం, దాన్నే నమ్ముకొని నిరంతరం శ్రమిస్తున్న రైతాంగం తీవ్ర ఆర్థిక సంక్షోభంలోకి నెట్టివేయబడటం జరుగుతున్నది.

ప్రస్తుతం మన వ్యవసాయరంగం అనేక సమస్యల నెదుర్కొంటున్నది. అందులో ముఖ్యంగా (1) పంటలకు సరిపోయే సాగునీటి సరఫరా లేకపోవడం, (2) రైతులకు అవసరమైనంత

---

నిలబడితే, ఈ సంస్థలూ దిగిరాక తప్పదు. అయినా మొండికేస్తే అంతర్గత వనరులకేమీ కొదవలేదు.

**నిరసనల పట్ల పాలకుల అసహనం**

ఎడిబి సమావేశస్థలానికి 5 కి.మీ. పరిధిలో ఎలాంటి నిరసన ప్రదర్శనలకు అనుమతినివ్వజాలమని ముఖ్యమంత్రి ప్రకటించారు. 144వ సెక్షన్ ప్రయోగించారు. ''చంద్రబాబు ప్రపంచబ్యాంకు ఏజెంటు'' అన్న నోటితోనే వైఎస్ ''ప్రపంచబ్యాంకు, ఎడిబిలంటే వామపక్షాలకు ఎలర్జీ'' అని తన అక్కసు వెళ్లగక్కారు. రాష్ట్రప్రజలకు ప్రపంచబ్యాంకు గురించి అర్థమైంది. అందుకే ఎడిబివైపు వైఎస్ దృష్టి సారించారు. ఈ నిరసనోద్యమం పాలకుల పథకానికి విఘాతం కలిగిస్తోంది. అందుకే అసహనం. పాలకుల ప్రయోజనాలు, ప్రజల ప్రయోజనాలు వేరైనప్పుడు, ఇలాంటి అసహనం సహజమే కదా!

ఉద్యోగ, కార్మిక, ఉపాధ్యాయ సంఘాల నిరసన మీద అనేక ఆంక్షలు విధించిన పాలకులు, ఆశ్చర్యకరంగా కొన్ని స్వచ్ఛందసంస్థలకు ఎడిబి సమావేశస్థలం వద్ద నిరసనకు అవకాశమిచ్చారు. ప్రతిఘటనకు, లోపాయికారీ చర్చలకు ఉన్న తేడాను పాలకులు, ఎడిబి అధినేతలు బాగానే అర్థం చేసుకున్నారు. స్వచ్ఛంద సంస్థలు కొన్ని ఎడిబితో లోపాయికారీ ప్రయత్నాలు కూడా చేశాయి. చేస్తామని కూడా చెప్పాయి. లోపాయికారీ ప్రయత్నాలతో షరతులను వెనక్కి కొట్టలేము. బయట ఎంత నిరసన తెలిపినా, ఒకసారి లోపాయికారీ ప్రయత్నాలకు తలొగ్గటమంటేనే ప్రతిఘటనను నీరుగార్చటం. అందువల్ల లోపాయికారీ చర్చలకు సిద్ధపడిన వారి నిరసనలు వారికేమీ ప్రమాదం కాదని పాలకులు సరిగానే గుర్తించారు.

ఏమైనా, ఎడిబి సమావేశాల సందర్భంగా నిరసన కార్యక్రమాల వల్ల ఎడిబి గురించి ప్రజలకు కనీస అవగాహన ఏర్పడడానికి తోడ్పడింది. రానున్న కాలంలో ప్రజలు ఈ విధానాలను ప్రతిఘటించటం తప్ప మరో మార్గం లేదు. □

వేరకు సంస్థాగతమైన పరపతి సులభ పద్ధతుల ద్వారా లభించకపోవడం, (3) మార్కెట్‌లో నాణ్యమైన విత్తనాలు, రసాయన ఎరువులు, క్రిమిసంహారక మందులు సరసమైన ధరలకు లభించకపోవడం, (4) కష్టపడి పండించిన పంటకు గిట్టుబాటుధరలు లేకపోవడం, (5) వరుసగా కరువు కాటకాలు సంభవించడం, (6) వ్యవసాయ సంబంధమైన శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం రైతులందరికి అందుబాటులో లేకపోవడం ప్రధానమైన కారణాలుగా చెప్పవచ్చు. ఇంకా అత్యధికశాతం రైతులు నిరక్షరాస్యులు కావడంవలన కూడా వ్యవసాయరంగం యొక్క అభివృద్ధి ఆటంకంగా పరిణమించింది. వ్యవసాయంపై ఆధారపడిన రైతులు, రైతు కూలీలు, వ్యవసాయ కూలీలు సంఘటితం కాలేకపోయినందువల్ల కూడా ఈ సామాజిక వర్గాలు న్యాయంగా రావలసిన వాటా పొందలేకపోతున్నారు.

ఇటీవలి కాలంలో వ్యవసాయానికి సాగునీరు అవసరం పెరుగుతూ వస్తున్నది. వరి, పత్తి, మిర్చి మొదలగు వాణిజ్య పంటల విస్తీర్ణం ఏటేట అధికమగుచున్నది, తయారుచేసిన విత్తనాలు, రసాయన ఎరువులు, క్రిమిసంహారక మందుల వాడకం నిరాటంకంగా పెరిగిపోయింది. మెట్టభూములలో వరి, పత్తి సాగులోకి తేవడం జరిగింది. ఇతర వాణిజ్య పంటల విస్తీర్ణం గణనీయంగా పెరుగుతున్నా అవసరాలకు అనుగుణంగా ప్రాజెక్టుల నిర్మాణం జరగలేదు. వ్యవసాయభూమి విస్తీర్ణం పెరిగినకొలది బావుల తవ్వకం అధికమైంది. కొంతకాలం తరువాత చాలినంత నీరు అందించడంలో బావులు విఫలం కాగానే బోరుబావులు వేయడం ప్రారంభమైంది. అడుగడుగునా బోరుబావులు రావడంతో అవి కూడా ఎండిపోవటం వలన బోరు బావులు మరింత లోతు వేయడానికి రైతులు వెనుకాడటం లేదు. ఈ క్రమంలో రైతులు విపరీతంగా అప్పులు చేయడం జరుగుతూ వచ్చింది. బోరుబావుల లోతుతో పాటు రైతుల అప్పులభారం ఎన్నో రెట్లు పెరిగింది. సాగునీటి కొరత ఏర్పడి బీడుభూముల విస్తీర్ణం కూడా పెరిగింది. సాగునీటితో ముడిపడి ఉన్న సమస్య అస్తవ్యస్తమైన విద్యుత్తు సరఫరా, లో వోల్టేజీతో కరెంటు మోటర్లు కాలిపోవడం. భూగర్భజలాలు అడుగంటడంతో తవ్విన బావులు ఎండిపోవడం, వేసుకొన్న బోరుబావులు సక్సెస్ కాకపోవడం, అమర్చిన విద్యుత్ మోటర్లు కాలిపోవడం మెట్టప్రాంతాలలో సాధారణ విషయంగా మారింది. ఈ క్రమంలో రైతులు తెచ్చిన అసలు, వడ్డీలు పెరిగి రుణభారం అధికమైంది.

భారతదేశంలో రైతులు అప్పుల్లో జన్మిస్తారు, అప్పుల్లో జీవిస్తారు, అప్పుల్లో మరణిస్తారని బ్రిటిష్ ఇండియాలోని ఒక సివిల్ సర్వీస్ అధికారి అభిప్రాయపడినట్లుగా ఇప్పటికీ మన వ్యవసాయగారులు అప్పులు చేయక తప్పడంలేదు. అప్పుల్లోనే బతుకుతున్నారు. మరణించేవరకు ఆ అప్పులు తీరవు. ఆధునిక పద్ధతుల ద్వారా వ్యవసాయం చేయడం ఎంతో ఖర్చుతో కూడుకున్నది. ప్రపంచీకరణలో భాగంగా సాగునీటితో పాటు విత్తనాలు, ఎరువులు, క్రిమిసంహారక మందులు, వ్యవసాయ పనిముట్లు అప్పులు తెచ్చి సమకూర్చుకోవాల్సిందే. కూలీల వేతనాలు, పాలేర్ల జీతాలు, కుటుంబ సాధారణ ఖర్చులు విద్య, వైద్యం మొదలగు వాని కొరకు కూడా అప్పులు తేవలసి వస్తున్నది.

స్వాతంత్ర్యం వచ్చి 58 సంవత్సరాలు పూర్తి అయినా బ్యాంకులు జాతీయం చేసి 35 సంవత్సరాలు గడచినా, సహకార సంఘాలు స్థాపించి వందసంవత్సరాలు పూర్తి అయినా వ్యవసాయరంగానికి కావలసిన పరపతిలో అత్యధికభాగం వడ్డీవ్యాపారులు, కమీషన్ ఏజెంట్లు ఇతర ప్రైవేట్ మార్గాల ద్వారా మాత్రమే సమకూరుతున్నది. ఈనాటికి కేవలం 15.5 శాతం వ్యవసాయపరపతి మాత్రమే వాణిజ్య సహకార బ్యాంకుల ద్వారా లభించగా, 84.5 శాతం ప్రైవేట్ వనరుల ద్వారానే సమకూరుతున్నది. ప్రైవేట్ రంగంలో వడ్డీ 24 శాతం నుండి 48 శాతం వరకు ఉండటం మూలాన, అసలు అప్పుకంటే వడ్డీల మొత్తం పెరిగిపోవడం జరుగుతుంది. మనదేశంలో రైతులు అప్పుల ఊబిలో పడిపోవడం, పంటలు పండకపోవడం తిరిగి అప్పుభారం మరింత పెరగడం చూస్తే ఇది ఒక విషవలయం లాగ పరిణమించిందనిపిస్తున్నది. మనదేశంలో దాదాపు 50 శాతం రైతులు అప్పుల భారంతో సంక్షోభంలో ఉన్నట్లు ఇటీవల నిర్వహించిన ఒక సర్వే వెల్లడించింది. ఆంధ్రప్రదేశ్‌లో 82 శాతం, తమిళనాడులో 72.5 శాతం రైతులు రుణగ్రస్తులైనారని ఈ సర్వే తెలిపింది.

వాణిజ్యబ్యాంకులు వ్యవసాయదారులకు పరపతి సమకూర్చడంలో ముందుకు రావడం లేదు. ముఖ్యంగా రుణమేళాలు నిర్వహించి రుణాల్ని మాఫీ చేయడం, సాధారణంగా బ్యాంకు అప్పులంటే కట్టనవసరంలేదనే భావన కొంతమంది రైతులలో ప్రబలడం వలన బ్యాంకు పరపతి వసూళ్లు ఆశాజనకంగా జరగకపోవడం జరుగుతున్నది. అప్పులబాధలో ఉన్న రైతులే గాక తిరిగి చెల్లించగలిగే సామర్థ్యం కలిగిన పెద్దరైతులు కూడా బ్యాంకుల అప్పులు చెల్లించకపోవడం జరుగుతున్నది. ఈ కారణాల మూలంగా వాణిజ్య బ్యాంకులు వ్యవసాయ పరపతిని సమకూర్చడానికి ముందుకు రావడం లేదు. అనేక దత్తత తీసుకొన్న గ్రామాలను, రైతులను బ్లాక్‌లిస్టులో చేర్చడం జరుగుతున్నది. అందువల్ల అతి తక్కువ వడ్డీరేట్లకు లభించే వాణిజ్యబ్యాంకులు, సహకార సంఘాల పరపతి పేదరైతులకు లభించకుండా పోతున్నది. ఒకసారి బ్యాంకు పరపతి పొందిన రైతు తిరిగి చెల్లించని కారణంగా శాశ్వతంగా ఆ బ్యాంకుకు దూరమవుతున్నాడు. గత 35 సంవత్సరాలలో వ్యవసాయ అభివృద్ధికి వాణిజ్యబ్యాంకులు, సహకార బ్యాంకులు సమకూరుస్తున్న దీర్ఘకాలిక రుణాలు 20 శాతం (1970) నుండి 12 శాతానికి (1999) తగ్గిపోయిందని రిజర్వుబ్యాంకు సర్వే తెలిపింది. ప్రతిసంవత్సరం వ్యవసాయరంగానికి కావలసిన ఒక లక్ష కోట్ల రూపాయల రుణంలో కేవలం 12 శాతం మాత్రమే బ్యాంకుల ద్వారా లభిస్తే వ్యవసాయదారులు వడ్డీ వ్యాపారస్తుల కబంధహస్తాలలో చిక్కకపోతే ఏమవుతుంది. చిన్న సన్నకారు రైతులకు లభించే బ్యాంకు పరపతి

ఇంకా స్వల్పమే. కొన్ని సందర్భాలలో రుణం చెల్లించని రైతులను బ్యాంకు అధికారులు వేధింపులకు గురిచేయడం, పరపతి ద్వార ఇచ్చిన ట్రాక్టర్లు, నాగళ్లు మొదలగు వానిని జప్తుచేయడం జరుగుతున్నది. నిరుపేదలైన రైతులకు ఇచ్చే రుణాల గురించి ఇంత జాగ్రత్త వహిస్తున్న బ్యాంకులు వందలాది కోట్ల రూపాయలు అప్పులు తీసుకొన్న పారిశ్రామిక వేత్తలను, బడా వ్యాపారస్తులను కనీసం అడగలేకపోతున్నాయి. ఎందుకంటే వీరంతా రాజకీయ అధికారానికి దగ్గరి సంబంధం ఉన్నవాళ్లు కాబట్టే.

జాతీయ సాంపుల్ సర్వే వారి అంచనాల ప్రకారం 2002 నాటికి మనదేశంలో సగటున ప్రతి రైతుకు రు.12,584 అప్పు ఉన్నట్లు వెల్లడైంది. కొన్ని రాష్ట్రాలలో అప్పుభారం మరీ అధికంగా ఉంది. పంజాబ్ రైతులకు సగటున రు.41,576లు, కేరళ రు.33,907, హర్యానా రు.26,007, ఆంధ్రప్రదేశ్ రు.23,965, తమిళనాడు రు.23,963 అప్పుభారం ఉన్నట్లు ఈ సర్వే తెలిపింది. రైతుల అప్పు నిరంతరం నిరాటంకంగా పెరుగుతూనే ఉంది. పంట పండినా పండకపోయినా అప్పు పెరగటం ఆగదు. పంటలు బాగా పండితే ధరలు ఉండవు. కరువులు ఏర్పడినప్పుడు ధర ఉన్నా పంట ఉండదు.

విత్తనాలు, కృత్రిమ ఎరువులు, క్రిమిసంహారకమందుల కంపెనీలు రైతులను జలగల్లాగ పీల్చుకతింటున్నాయి. నాణ్యత లేని విత్తనాలు, ఎరువులు, క్రిమిసంహారక మందులు రైతులను కుంగదీస్తున్నాయి. అప్పులు తెచ్చి అత్యధిక ధరలకు విత్తనాలు వగైరా కొనుగోలు చేస్తే చివరకు దిగుబడి రాక దిగులుపడ్డ రైతులు ఆత్మహత్యలు చేసుకొన్నవారు అనేకం. ఈ నకిలీ సరుకులు అమ్ముతున్న డీలర్లు, ఏజెంట్లు మేడల మీద మేడలు కట్టుకుంటున్నారు. ఇంత జరుగుతున్నా ప్రభుత్వ అధికారులు గాని, ప్రజాప్రతినిధులు గాని నిమ్మకు నీరెత్తిన చందాన మౌనం వహిస్తున్నారు. పైరసీ సినిమాల విషయంలో నేరస్తులను శిక్షించడానికి ఆఘమేఘాల మీద చట్టాలు చేసిన పాలకులు రైతులను మోసం చేసే కంపెనీల యజమానులకు ఎలాంటి శిక్ష విధించే చట్టాలు చేయలేదు. రైతులు అమ్మబోతే అడవి కొనబోతే కొరివి. అన్ని కష్టాలకోర్చి పంట పండిస్తే మార్కెటులో ధరలు ఉండవు. వర్తకులు, కమీషన్ ఏజెంట్లు కుమ్మక్కై ధరలను కిందిస్థాయిలోనే నియంత్రిస్తారు. మార్కెట్ నియమ నిబంధనలు కాగితాలకే పరిమితం. ప్రపంచీకరణతో వ్యవసాయరంగంలో ఒక వక్క ఉత్పత్తివ్యయం పెరిగింది. మరోవక్క మార్కెట్‌లో వ్యవసాయ ఉత్పత్తుల ధరలు తగ్గిపోతాయి. 'ముందు నుయ్యి, వెనుక గొయ్యి' వలె రైతులను విత్తనాలు, రసాయన ఎరువులు, క్రిమిసంహారక మందులు విక్రయించేవారు మోసం దగా చేస్తుండగా ఉత్పత్తి జరిగినాక వ్యాపారస్తులు ధరలు తగ్గిస్తున్నారు.

వరుసగా ఏర్పడుతున్న కరువు కాటకాలు రైతులను మరీ కుంగదీస్తున్నవి. విత్తనాలు, ఎరువులు, క్రిమిసంహారక మందులు, సాగునీటి కొరకు బోరుబావులు, కరెంటు మోటార్లు మొదలగు వానిపై వేలాది రూపాయలు ఖర్చుచేసి వ్యవసాయం చేస్తే వంటలు ఎండిపోవడం గాని దిగుబడి పడిపోవడం గాని జరుగుతున్నది. అప్పులు మిగిలిపోయి రుణభారం పెరిగిపోతున్నది. ధైర్యం కోల్పోయిన రైతులు కొందరు ఆత్మహత్యలు చేసుకోవడం, మరి కొందరు వ్యవసాయం వదిలి పట్టణాలకు వలస పోవడం లేదా భూములు అమ్ముకొని వ్యవసాయ కూలీలుగా దిగజారిపోవడం జరుగుతున్నది. గత కొద్ది సంవత్సరాలుగా దేశంలో 4000 మంది రైతులు ఆత్మహత్యలకు పాల్పడినట్లు ప్రభుత్వ లెక్కలు తెలుపుతున్నాయి. అనధికార లెక్కల ప్రకారం ఈ సంఖ్య 10,000 పైగా ఉంటుందని ఒక అంచనా. వ్యవసాయం అభివృద్ధి జరిగిందనే రాష్ట్రాలలో ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్, పంజాబ్, ఉత్తరప్రదేశ్, మహారాష్ట్ర, కేరళ, బెంగాల్ రాష్ట్రాలలో ఈ ఆత్మహత్యలు అధికంగా ఉన్నాయని ప్రభుత్వ వివరాలు తెలియజేస్తున్నాయి.

'తిలాపాపం తలా పిడికెడు' అన్నట్లు వ్యవసాయదారులను విత్తన వ్యాపారులు, రసాయన ఎరువులు, క్రిమిసంహారక మందుల డీలర్లు, వడ్డీ వ్యాపారస్తులు, పంట కొనుగోలు చేసేవారు. ప్రభుత్వ అధికారులు అందరూ నష్టపెట్టేవారే. ఇంత జరుగుతున్నా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రేక్షక పాత్ర పోషిస్తున్నాయి. రైతుల గురించి వేసిన కమిటీల రిపోర్టులు ప్రభుత్వ కార్యాలయాల్లో దుమ్ము ఋక్కుతున్నాయి. రాష్ట్రప్రభుత్వాలు వ్యవసాయం కొరకై కేటాయించే బడ్జెట్ ఒక శాతానికి కూడా మించడం లేదు. అదేవిధంగా కేంద్రప్రభుత్వం తన వార్షిక బడ్జెటులో గాని పంచవర్ష ప్రణాళికల్లోగాని వ్యవసాయానికి చేసే కేటాయింపులు 4 శాతానికి మించడం లేదు. వ్యవసాయ ఉత్పత్తి వ్యయాలు నాలుగు నుండి ఆరు రెట్లు పెరగగా ఉత్పత్తికి వచ్చే ధరలు కేవలం మూడు నుండి నాలుగు రెట్లు మాత్రమే పెరిగినట్లు పరిశోధనలు తెలియజేస్తున్నాయి. ప్రపంచీకరణ ప్రభావంతో వ్యవసాయ పెట్టుబడులు రోజురోజుకు పెరిగిపోతున్నాయి. విత్తనాలు, ఎరువులు, పురుగుమందులు కొనుగోలు చేయాలంటే అందుకు అప్పులు తేవాలి. కొన్ని సందర్భాల్లో పంట విక్రయించగా వచ్చిన మొత్తం ఈ అప్పులకే సరిపోదు. అదేవిధంగా గ్రామీణ ప్రాంతాల కుటుంబాల వినియోగపు ఖర్చు ప్రతి సంవత్సరం నాలుగు శాతం పెరుగుతుండగా ఆదాయం మాత్రం 1.5 శాతం మాత్రమే పెరుగుతున్నదని పూసా వ్యవసాయ పరిశోధన సంస్థ డైరెక్టర్ ప్రొ.రమేశ్‌చంద్ పేర్కొన్నారు. ఇంకా గ్రామీణప్రాంతాల్లో ఆహారం కాకుండా ఇతర అవసరాలైన బట్టలు, ఇంటి అద్దె, విద్య, వైద్యం, రవాణా, వినోదం మొదలగు వానిపై చేసే ఖర్చు గణనీయంగా పెరిగినట్లు టాటా వారి సామాజిక శాస్త్రాల సంస్థ చేసిన సర్వేలో వెల్లడైంది. 1970లో గ్రామీణ కుటుంబాలు చేస్తున్న సగటు వినియోగపు ఖర్చులో 26 శాతం ఆహారేతర అవసరాలపై వెచ్చిస్తుండగా 1999 నాటికి అది 40 శాతానికి పెరిగిందని ఈ పరిశోధన తెలియజేసింది. జనన, మరణ, వివాహాది కార్యక్రమాలకు చేసే ఖర్చులు విపరీతంగా పెరిగాయని కూడా తెల్పింది.

(తరువాయి 25 వ పేజీలో)

# ఏ చిట్కా వైద్యంలో ఏముందో!

**ఎన్.ఇన్నయ్య**

వైద్యం ఖరీదుగా మారిన రోజుల్లో మార్గాంతర చికిత్సల కోసం వెతకడం సహజం. ఒకవైపు కార్పొరేట్ ఆస్పత్రులు దోపిడీ చేస్తుండగా, సామాన్యులకు చికిత్స అందుబాటులో లేదు. అలాంటప్పుడు ఆదుకోవలసింది ప్రభుత్వమే. కాని వైద్యరంగంపై శీతకన్ను వేశారు. ఈ నేపథ్యంలో అనేక మార్గాంతర చికిత్సలు వచ్చాయి. అయితే అవి నిజంగా జనానికి ఉపకరిస్తున్నాయా అనేది సమస్యగా మారింది.

ప్రభుత్వం శాస్త్రీయ వైద్యాలనే గుర్తించి సహాయపడాలని నిర్ణయించింది. రంగంలో ఉన్న కొన్ని చికిత్స విధానాలు, తమనూ గుర్తించి సహాయపడాలని కోరాయి. ప్రభుత్వం నిరాకరించడంతో కోర్టును అర్థించాయి. ఢిల్లీ హైకోర్టు 1998 లోనే ఈ విషయం పట్టించుకొని, ఏ వైద్యవిధానం శాస్త్రీయం, ఏది కాదు నిగ్గు తేల్చి చెప్పమన్నది. దీనిపై కేంద్రప్రభుత్వం ఆలిండియా మెడికల్ కౌన్సిల్ రీసెర్చ్ ద్వారా నిపుణుల సంఘాన్ని నియమించింది. డైరెక్టర్ జనరల్ ఎన్.కె.గంగూలి అధ్యక్షతన 15 మంది నిష్ణాతుల సంఘం ఏర్పరచింది. వారంతా 5 సంవత్సరాలు పరిశీలించి నివేదిక సమర్పించారు.

**వ్యాఖ్య**

ఎలక్ట్రోపతి, ఎలక్ట్రోహోమియో చికిత్సల వారు తొలుత కోర్టుకు వెళ్లారు. వారితో సహా నిపుణుల సంఘం పరిశీలించిన చికిత్సలు: ఎలక్ట్రోపతి, ఎలక్ట్రో హోమియోపతి, రిఫ్లెక్సాలజీ మూత్ర వైద్యం, అరోమా థెరపి, కలర్ థెరపి, జెమ్స్ అండ్ స్టోన్ థెరపి, ఆటోయూరిక్ థెరపి, మాగ్నటో థెరపి.

ఈ చికిత్సా విధానాలు శాస్త్రీయమా కాదా అనడానికి కొన్ని గీటురాళ్లు నిర్ధారించారు.

1. మార్గాంతర చికిత్స వైద్యవిధానంగా స్థాపింతమైందా.
2. చికిత్సా విధానాన్ని పాటించే నిపుణులు ఉన్నారా
3. విధానానికి విపులంగా సాహిత్యం ఉందా
4. ప్రభుత్వం ఈ చికిత్సను గుర్తించవచ్చా
5. ఇంతకుముందే ఉన్న వైద్య విధానాలకు భిన్నంగా ఈ విధానంలో కొత్త మార్గాలున్నాయా
6. రోగ నిర్ధారణ, చికిత్సావిధానం గురించి విస్తృతంగా వివరాలున్నాయా
7. ఈ చికిత్స ఆవిర్భవించిన దేశంలో ప్రభుత్వ గుర్తింపు ఉందా
8. చికిత్స విశిష్టత గురించి ప్రమాణపూర్వక సాహిత్యం ఉందా
9. చికిత్సకు చెందిన ఔషధాలు, వాటి నాణ్యతకు ఎలాంటి వివరాలు ఉన్నాయి
10. చికిత్సను బోధించడానికి, శిక్షణ ఇవ్వడానికి తగిన ప్రామాణిక సంస్థలు ఉపాధ్యాయులు, పరికరాలు, సౌకర్యాలు ఉన్నాయా
11. డాక్టర్లను తయారుచేసే ప్రామాణికత ఏమిటి
12. పరీక్షావిధానం, పాఠ్యప్రణాళిక, పాఠ్యగ్రంథాలు ఏమిటి

ఇవన్నీ ప్రత్యామ్నాయ చికిత్సా విధానాలకు అన్వయించి పరిశీలించారు. అప్పుడు విషయం బయటపడింది. ఎలక్ట్రోహోమియోపతి అనేది హోమియోపతి కాదని, కేవలం కొన్ని హోమియో ఔషధాలు వాడడం మినహా, వీరి విధానం వేరని తేలింది. ఎలక్ట్రోపతిలో నెగటివ్, పాజిటివ్ అనే రెండు విభాగాలుగా రోగాలను వర్గీకరించారు. నెగటివ్ జబ్బులకు పాజిటివ్ మందులు, పాజిటివ్ రుగ్మతలకు నెగటివ్ ఔషధాలు ఇవ్వాలన్నారు. వీరు వాడేది మూలికలనీ, అవి ప్రమాణపూరితం కాదని తెలుసుకున్నారు. ప్రపంచంలో ఎక్కడా వీరికి అధికార గుర్తింపు లేదు. ఇటలీలో గుర్తింపు ఉందని చెప్పగా, ఆ విషయం విచారిస్తే, అబద్ధమని స్పష్టపడింది.

రేకి చికిత్స జపాన్‌లో పుట్టింది. అక్కడ అధికార గుర్తింపు లేదు.

ఇటీవల మన రాష్ట్రంలో గణపతి సచ్చిదానంద ప్రచారం చేస్తున్న మ్యూజిక్ థెరపి కూడా అశాస్త్రీయమని కచ్చితంగా చెప్పారు.

ప్రాణిక్ హీలింగ్ పేరిట రవిశంకర్ చేస్తున్న చికిత్సను లోగడ తెలుగుదేశం ప్రభుత్వం అధికార పూర్వకంగా ప్రోత్సహించింది. ఇది అశాస్త్రీయ పట్టికలో చేరిందే.

మొరార్జీ దేశాయి ప్రధానిగా ఉన్నప్పుడే మూత్రవైద్యం బహుళ ప్రచారంలోకి వచ్చింది. ఇది తప్పుడు పద్ధతి అని కమిటీ చెప్పింది.

ఈ మధ్య రాళ్ల వైద్యం పెద్ద వ్యాపారంగా మారింది. మీడియాలో విపరీత ప్రచారం సాగుతున్నది. ఆరోగ్యానికీ, సంపదకూ రాళ్లసంబంధం చూపుతున్నారు. వజ్రాలు, కెంపులు, పచ్చలు, ముత్యాలు, ఎలాంటివి ధరించాలి, వాటి లాభనష్టాలు, జ్యోతిష్యంతో ముడిపెట్టి చెబుతున్నారు. ఇదంతా అశాస్త్రీయమే.

అయస్కాంతం పనిచేస్తుందంటూ ఈమధ్య పరుపులు, గొలుసులు రకరకాల విధానాలు ఆచరిస్తున్నారు. అమాయకులు బాగా డబ్బు ఖర్చుచేస్తున్నారు. ఇందులో ఏమాత్రం సత్యం లేదని తేల్చారు.

కేంద్ర ప్రభుత్వ ఆరోగ్యశాఖ నిపుణుల నివేదిక ఆమోదించింది. అన్ని రాష్ట్రప్రభుత్వాలకు పంపి, అమలు పరచమన్నది. మార్గాంతర చికిత్సలు వాడడం తగదని, డాక్టర్ అని పేరు పెట్టుకోరాదని, డిగ్రీలు డిప్లొమాలు ఇవ్వరాదని, కోర్సులు నడవరాదని, ఆర్థికసహాయం చేయరాదని చెప్పింది. అంతేగాక ప్రజలలో ఈ

విషయం బాగా ప్రచారం చేయాలన్నది.

మన రాష్ట్ర ప్రభుత్వ ఆరోగ్యశాఖ 2003 నవంబరు 27న కేంద్ర ఉత్తరువులు అందుకున్నది. కాని నిమ్మకు నీరెత్తినట్లు మౌనం వహించింది. ఆ తరువాత వాస్తవాలను అధికారుల దృష్టికి తెచ్చినా ఫలితం రాలేదు. దొంగవైద్యాలను అరికట్టడానికి, దొంగవైద్యులను శిక్షించడానికి చట్టాలు ఉన్నాయి. కాని పూనుకోవడం లేదు. మార్గాంతర చికిత్సలతో బాధపడేవారి సంఖ్య సర్వే జరగాలి. వారికి ఎలాంటి ఇన్సూరెన్స్ భద్రత లేదు. డబ్బు వృథా అవుతూ, ఆరోగ్యం క్షీణించిన తరువాత ఆస్పత్రులకు వస్తున్నారు.

డ్రగ్స్ అండ్ మాజికల్ రెమిడీస్ చట్టప్రకారం, డాక్టర్ కానివారు చికిత్సలు చేసినప్పుడు, వైద్యశాఖాధికారులు తక్షణం రంగప్రవేశం చేసి చర్య తీసుకోవచ్చు. చేపమందు నుండి రుద్రాక్షల వరకూ ఈ చట్టం వర్తిస్తుంది. ప్రజల ప్రాణాలతో చెలగాటమాడేవారిని చూస్తూ ఊరుకోరాదు.

ఆరోగ్యం దెబ్బతిన్నప్పుడు చిట్కావైద్యులు సలహాలు చెప్పడం ఆ సమయంలో ప్లాసిబో ప్రభావం వలన తగ్గితే, అది తమ మహత్తుగా చెప్పడం సహజం. అలాగే బాబాలు, మాతలు నయం చేస్తారనుకోవడమూ కద్దు. మహిమలు గల స్వాములు, సత్యసాయిబాబా వంటివారు, ఆస్పత్రులు కట్టించారంటే, రోగాలు నయంకావడానికి డాక్టర్లపై ఆధారపడుతున్నారని భక్తులు గ్రహించకపోవడం దురదృష్టకరం. నమ్మకాల బలహీనతల్ని చిట్కా వైద్యులు బాగా దుర్వినియోగం చేస్తున్నారు.

మన రాష్ట్రంలో చిట్కావైద్యాల బాధితులు ఒక కోటి వరకూ ఉంటారు. ఒక వైద్యం విఫలమైతే, 'మా కర్మ' అని, మరో చిట్కా కోసం పరిగెడుతున్నారు. పైగా వైఫల్యాలు రిపోర్టు చేయరు. అదే చిట్కా వైద్యులకు కవచం. వీటన్నిటి దృష్ట్యా ప్రభుత్వం బాగా పట్టించుకోవాలి. ❑

( 23వ పేజీ తరువాయి)

మన నాయకులు గ్రామీణ ప్రాంతాలకు వెళ్లిన ప్రతిసారి రైతులకు వరాలవర్షం కురిపిస్తారు., భ్రమలు కల్పిస్తారు. నిజానికి ఈ ప్రభుత్వాలు వ్యవసాయాన్ని, రైతులను, పూర్తిగా నిర్లక్ష్యానికి గురిచేస్తున్నాయి. ప్రపంచీకరణ నేపథ్యంలో వ్యవసాయదారులకు ఇచ్చే ప్రాధాన్యత చివరి అంశంగా మారింది.

ఈనాటికీ 62 శాతం శ్రామికులు ఆధారపడ్డ ఈ రంగాన్ని పాలకులు దిగజార్చడం వలన ఆర్థిక వ్యవస్థ పునాదులు బలహీనమవుతున్నాయని పాలకులు గుర్తించాలి. నిరుద్యోగం, పేదరికం, అనారోగ్యం, అసమానతలు నెలకొన్న గ్రామీణ ప్రాంతాలు తిరిగి అభివృద్ధి పథంలోకి రావాలంటే వ్యవసాయానికి, గ్రామీణాభివృద్ధికి తగిన ప్రాధాన్యతలు ఇవ్వాల్సిందే. మధ్యతరహా సాగునీటి ప్రాజెక్టులు నిర్మాణం చేసి వర్షపునీరు వృథా కాకుండా వ్యవసాయ అభివృద్ధికి అందించాల్సిన అవసరముంది. వర్షపాతం తక్కువగా ఉన్న ప్రాంతాలలో మెట్టపంటలకు ప్రోత్సాహకాలిచ్చి రైతులను సంక్షోభంలోకి దించిన పత్తిపంట నుండి వారి దృష్టిని మరల్చాలి. కేవలం విత్తనాల, రసాయన ఎరువుల, క్రిమిసంహారక మందుల కంపెనీల డీలర్లు, కమిషన్ ఏజెంట్ల కొరకై ఈనాటి వ్యవసాయం సాగుతున్నది వాస్తవం. పంటలో అధికభాగం ఈ నకిలీలకే చెందుతుంది. కాబట్టి ఈ నకిలీల విషవలయంనుండి రైతులను, వ్యవసాయరంగాన్ని కాపాడాలంటే తిరిగి పూర్వం వలె రైతు స్వంత విత్తనాలను, స్వాభావికమైన సేంద్రియ ఎరువులను విరివిగా ఉపయోగించే విధంగా ప్రోత్సహించి ఉత్పత్తివ్యయాన్ని తగ్గించుకోవచ్చు. చాలినంత పరపతి సకాలంలో వాణిజ్యబ్యాంకుల ద్వారా అందించే సౌకర్యం కల్పించాలి. వ్యవసాయ రుణాలు కేవలం 6-8 శాతం వడ్డీలకే ఇవ్వాలి. వ్యవసాయ మార్కెట్లలో కూరుకుపోయిన అస్తవ్యస్తమయిన పరిస్థితులను నిర్మూలించాల్సి ఉంది. రాజకీయ నాయకులను మార్కెట్ కమిటీ ఛైర్మన్ మొదలగు పదవులలో నియమించరాదు. రైతులను మోసం చేసే వారికి కఠినశిక్షలు విధించే కోర్టులు ఏర్పాటుచేయాలి. పంటలకు బీమా సౌకర్యం కల్పించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. వ్యవసాయ గిడ్డంగులను గ్రామస్థాయిలో ఏర్పాటుచేయడం, కనీస ధరలు లేని పక్షంలో రైతుల ఉత్పత్తిని గిడ్డంగులలో నిల్వచేసి వారి అవసరాలకు సరిపడే స్వల్పకాలిక పరపతి కల్పించే ఏర్పాట్లు ప్రభుత్వమే చేయాలి. వ్యవసాయరంగం ఎదుర్కొంటున్న సమస్యలు ఎప్పటికప్పుడు పర్యవేక్షించి సత్వర పరిష్కారాలను సూచించే రైతు సంఘాలను ఏర్పాటు చేయాలి. చిన్న, సన్నకారు రైతుకూలీలకు ఈ సంఘాలలో ప్రాధాన్యత, అధికారం కల్పించాలి. అంతేగాక ఈ సంఘాలకు చట్టబద్ధత కల్పించాలి. రాష్ట్ర కేంద్ర వార్షిక బడ్జెటులలో కనీసం 10 శాతం నిధులను కల్పించి వ్యవసాయరంగాన్ని తిరిగి అభివృద్ధిపథంలో చేర్చాల్సిన అవసరం మనందరికి ఉంది. ❑

## తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట వజ్రోత్సవ (60 ఏళ్ల) ప్రత్యేక సంచిక

**తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం (1946-51) ప్రారంభమై ఈ జులై 4కి 60 సంవత్సరాలు. ఈ సందర్భంగా తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటానికి సంబంధించిన విభిన్న రాజకీయ, ఆర్థిక, సామాజిక, చారిత్రక, సాంస్కృతిక కోణాల విశ్లేషణతో వీక్షణం జులై 2006 సంచిక ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. ఈ సంచిక కోసం రచనలను ఆహ్వానిస్తున్నాం. రచనలు మాకు అందవలసిన చివరితేదీ జూన్ 15, 2006**

- సంపాదకులు

# మేధావులపై గ్రామ్‌షీ అభిప్రాయాలు

వజ్రాల అంజిరెడ్డి

విశ్లేషణ

సాధారణంగా మేధావి అనగానే విశ్వవిద్యాలయ అధ్యాపకులు, శాస్త్రవేత్తలు, సాహిత్యవేత్తలు, పత్రికా సంపాదకులు మనకు వెంటనే గుర్తుకు వస్తారు. వీరు నిరంతర అధ్యయనం, పరిశీలన ద్వారా మానవాళి సాధించిన తరతరాల జ్ఞాన వారసత్వాన్ని నూతన తరాలకు అందించే పాత్రను నిర్వహించడమే కాక, ప్రతి తరానికి మార్గదర్శకులుగాను భవిష్యత్ సమాజ దార్శనికులుగా పరిగణించబడతారు. భౌతిక నాగరికతకు ఆధారమైన అతి సాధారణ పనిముట్ల నుండి అత్యంత సాంకేతిక విజ్ఞాన సృష్టిలోనూ, అలాగే భావపరమైన సాంస్కృతిక విలువలు, ఆదర్శాలు, విశ్వాసాలు, సామాజిక నియమాలు, సాహిత్యం, కళలు,తత్వశాస్త్రం మొదలయిన శాస్త్రాల ద్వారా అందించబడిన విజ్ఞానమే ఆదిమ సమాజాలు నాగరిక సమాజాలుగా పరివర్తన చెందడానికి కారణమైనదని చెప్పడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

అయితే ఈ పరిణామక్రమంలో మేధోపరమైన శ్రమకు ఇవ్వబడ్డ గుర్తింపు, గౌరవం శారీరక శ్రమకు ఇవ్వక పోవడమే బాధాకరమైన విషయం. నాగరికత నిర్మాణంలో శ్రమపాత్రను (శారీరక, మేధోపర శ్రమలు) దానికి ఇవ్వవలసిన సముచితమైన విలువను, స్పష్టపరచిన మార్క్స్ తాత్విక సిద్ధాంతం, మరో నూతన నాగరికతను నిర్మిస్తుందని, గత శతాబ్ద కాలం నుండి ప్రపంచవ్యాప్తంగా ప్రగతిశీల శక్తులు ఆశించాయి. రష్యా, తూర్పు ఐరోపా దేశాలలో నిర్మించబడుతున్న సోషలిస్ట్ వ్యవస్థ, మార్క్సిస్ట్ తాత్విక పునాదుల ఆధారంగా జరుగుతుందని, ఈ వ్యవస్థే ప్రపంచవ్యాప్తంగా గత శతాబ్దం నుండి కోట్లాది ప్రజానీకాన్ని సామాజిక, రాజకీయ ఉద్యమాల వైపు ఆకర్షించడానికి కారణమైనది. కొంతమేరకు మనిషి ప్రాథమిక అవసరాలను తీర్చడంలో సఫలీకృతమైన ఈ సామ్యవాద వ్యవస్థ, ప్రాథమిక స్థాయిలో కల్పించిన సమానత్వం, విస్తృతమైన స్వేచ్ఛకు ఆధారం అవుతుందన్న ఇంగితజ్ఞాన అంశాన్ని కూడ గుర్తించకపోవడం, ఆ వ్యవస్థ యొక్క మౌలిక బలహీనతలు స్టాలిన్ కాలం నుండి బహిర్గతం కావడం, వీటిని అంతరంగికంగా సరిదిద్దుకునే వ్యవస్థీకృత సౌలభ్యం లేకపోవడం, అంతిమంగా ఆ వ్యవస్థ కుప్పకూలిపోవడం గత దశాబ్దంలో మనం చూశాం. నిర్మితమైన సామ్యవాద వ్యవస్థ ప్రధానంగా అంతరంగిక కారణాల ఆధారంగానే పతనం కావడం, సామ్యవాదులందరిని నిరాశపరచడమే కాక, తిరిగి ఆ వ్యవస్థ పునాదులకు ఆధారమైన మార్క్సిస్ట్ సిద్ధాంతాన్ని పునఃపరిశీలించవలసిన అవసరాన్ని గుర్తింపజేసింది. భావజాలాల మధ్య సంఘర్షణ అంతమైందన్న వాస్తవం, సామ్యవాద వ్యవస్థ పతనం ద్వారా రుజువు కాబడిందని, పెట్టుబడిదారీ వ్యవస్థే ప్రపంచ మానవాళికి ఆదర్శప్రాయమైన ఏకైక వ్యవస్థ అని, ఫుకుయామా లాంటి మేధావుల అభిప్రాయాలు ఆలోచనాపరులను నిశ్చేష్టులను చేస్తున్నాయి. అలాగే పాశ్చాత్యదేశాలలో 16, 17వ శతాబ్దాల నుండి ప్రారంభమైన ఆధునికత మధ్యయుగాల నుండి కొనసాగిన మత ప్రాబల్యాన్ని నిర్వీర్యం చేసిందని, ఆ విధంగా ఆ దేశాలలో లౌకిక భావజాల పునాదులపై నూతన నాగరిక వ్యవస్థ నిర్మించబడుతుందని భావించాం. ఆ దేశాలలో నిర్మించబడిన నాగరికతకు పునాది మౌలికంగా క్రైస్తవ మతం అని, అలాగే ఇతర నాగరికతలకు (మధ్య ఆసియా, భారతదేశం, చైనా, ఇతర ప్రాచ్యదేశాలు) ఆయా దేశాలలోని ప్రధాన మతాలు అని, 21వ శతాబ్దంలో పాశ్చాత్య నాగరికతకు ప్రమాదం, ఇతర నాగరికతల నుండి పొంచి ఉందన్న వాదనను, సామ్యూల్ హంటింగ్‌టన్ లాంటి అమెరికన్ రాజనీతి శాస్త్రవేత్తలు ఇటీవల చేస్తున్నారు. ఆధునికతకు ప్రాతిపదిక వివేచన వ్యక్తీకరించిన లౌకిక భావాలే కాని, మత సంస్కృతి కాదన్న విశ్వాసాన్ని, మరోసారి రూఢి పరచుకోవాల్సిన అవసరం వుంది. సామ్యవాద వ్యవస్థ పతనానికి మూలాలు మార్క్సిస్ట్ తాత్విక పునాదులలోనే అన్వేషించవలసిన అవసరం ఉందని, అలాగే భావజాలాల మధ్య సంఘర్షణ అంతం కాలేదని, శ్రమదోపిడీ పై ఆధారపడ్డ పెట్టుబడిదారీ వ్యవస్థ, ప్రపంచ మానవాళికి ఎన్నటికీ ఆదర్శప్రాయం కాజాలదని, అలాగే వర్తమాన కాలంలో వివిధ దేశాల మధ్య జరుగుతున్న సంఘర్షణలకు కారణాలు, మత ప్రాతిపదికపై పేర్కొనబడుతున్న నాగరికతల మధ్య సంఘర్షణలలో లేవని చెప్పేందుకు కొంచెం తెగువ అవసరమనిపిస్తుంది.

**మార్క్సిస్ట్ సిద్ధాంత పునఃపరిశీలనావశ్యకత**

నేటి పెట్టుబడిదారీ సమాజం, సామ్యవాద సమాజంగా పరివర్తన చెందడంలో, మార్క్సిస్ట్ సిద్ధాంత పాత్రను పునః పరిశీలించడంలో, మార్క్స్, లెనిన్ ప్రతిపాదిత భావనలైన భావజాలం, శ్రామికవర్గ నియంతృత్వం, శ్రామికవర్గ రాజకీయ పార్టీ స్వభావం, ప్రజాస్వామ్య రాజ్య స్వభావం మొదలైన భావనలను, నిశిత పరిశీలనకు గురిచేయవలసిన అవసరం ఉంది. ఈ శతాబ్దకాలంలో ఉదారవాద ప్రజాస్వామ్య భావాలు, ఆధునిక రాజ్య స్వభావాన్ని కొంతమేరకైనా ప్రభావ పరిచాయన్నది వాస్తవం. అలాగే ఈ 'ప్రజాస్వామ్య రాజ్యం' భిన్న రాజకీయ, ఆర్థిక వత్తిడుల ప్రభావ రీత్యా, ప్రజాశ్రేయస్సుని పరిమితస్థాయిలోనైనా తన బాధ్యతగా గుర్తించి, ప్రజల కనీస అవసరాలను కొంతమేరకు

కల్పిస్తుంది. ప్రపంచవ్యాప్తంగా సార్వత్రిక ఓటుహక్కు ఆధారంగా ప్రజలు నిర్ణీతకాలానికి తమను పరిపాలించుకొనేందుకు ప్రభుత్వాలను ఏర్పరచుకోవడం, ప్రజాస్వామ్య భావనల పట్ల, ప్రజాస్వామ్య ప్రక్రియల పట్ల ప్రజలలో ఆదరణ పెరిగిందనేది వాస్తవం. సామాన్య ప్రజానీకంపై రాజ్యనియంత్రణ కాని, పాలకవర్గాల ప్రాబల్యం కాని, ప్రధానంగా బలం పై ఆధారపడడం ద్వారా కాకుండా 'ప్రజానమ్మతి'పై ఆధారపడడం ద్వారా జరుగుతుందని మనం గమనించగలం. శ్రమదోపిడీపై ఆధారపడి కొనసాగే పెట్టుబడిదారీ వ్యవస్థ, ఆ శ్రమ దోపిడీకి గురికాబడుతున్న ప్రజానమ్మతిని ఎలా పొందగలుగుతుందనేది, అత్యంత ఆసక్తికరమైన ప్రశ్న! ఈ ప్రశ్నకు కొంతమేరకు సృజనాత్మక సమాధానాన్ని ఇచ్చేందుకు ప్రయత్నించిన వ్యక్తి ఇటాలియన్ కమ్యూనిస్ట్ పార్టీ నాయకుడు ఆంటోనియో గ్రామ్‌షీ.

ఈ వ్యాసంలో ప్రధానంగా గ్రామ్‌షీ మేధావులపై వ్యక్తీకరించిన అభిప్రాయాలను విశ్లేషించేందుకు ప్రయత్నిస్తాను. అలాగే గ్రామ్‌షీ భావజాలంపై వ్యక్తీకరించిన అభిప్రాయాలను కూడా వివరిస్తాను.

**మేధావుల వర్గీకరణ :**

ఇతర మార్క్సిస్ట్ సిద్ధాంతకర్తలకంటే భిన్నంగా గ్రామ్‌షీ పాశ్చాత్య పెట్టుబడిదారీ సమాజాల పరివర్తనలో మేధావుల స్వతంత్ర నిర్దేశిత పాత్రను గుర్తించాడు. ఈ దేశాలలో రాజ్యపాలన బలాధిక్యతపై కాక భావజాల ఆధిక్యత ఆధారంగానే కొనసాగుతుందని చెప్పాడు. ఈ సమాజాలలో సామాజిక ప్రాబల్య సంబంధాలు భావజాల ప్రాతిపదికపై ఆధారపడి, వ్యవస్థీకృతం అవుతున్నాయని, భావజాల నిర్మాణంలో మేధావుల పాత్ర ఉందని చెప్పాడు. అయితే ఈ భావజాల కర్తలైన మేధావులు తాము ప్రతిపాదించే భావసముదాయానికి ఏ సామాజిక వర్గ ప్రయోజనాలను పరిరక్షించే ఉద్దేశ్యం లేదని, సార్వజనీన ప్రయోజనాలను పరిరక్షించడమే తమ బాధ్యతని, తాము సత్యాన్వేషకులమే తప్ప ఏదో ఒక వర్గం పట్ల పాక్షికతను చూపడం లేదని వాదిస్తారు. ఆధిపత్య సామాజిక సంబంధాలను సమర్థించే భావజాల పునాదులను ప్రశ్నించడం ద్వారా ఏ విధంగా భావాలు ఏ వర్గప్రయోజనాలను పరిరక్షిస్తున్నాయో వివరించడం ద్వారా మేధావుల తటస్థత వాస్తవం కాదని నిర్ధారణ అవుతుందని, మేధావులు తెలిసో, తెలియకో ఏదో ఒక వర్గ ప్రయోజనాలను పరిరక్షిస్తారని గ్రామ్‌షీ చెప్పాడు. భావజాలానికి అధికారానికి మధ్య సన్నిహిత సంబంధం ఉందని పెట్టుబడిదారీ సమాజాలలో ఈ అధికార సంబంధాలను సమర్థించే ఆధిపత్య భావజాలాన్ని ప్రశ్నించే ప్రత్యామ్నాయ భావజాలాన్ని ప్రతిపాదించబడటం, తద్వారా శ్రామికవర్గం తన వాస్తవ స్థితిని గుర్తించడం ద్వారా మాత్రమే, సామ్యవాదం వైపు సామాజికమార్పును నిర్దేశించగలమని చెప్పాడు.

స్వతఃసిద్ధంగా ఆలోచించడమే మేధాపర లక్షణమయితే, మనుషులందరూ మేధావులేనని, కాని ఏ సమాజంలోనైనా కొద్దిమంది మాత్రమే ఆలోచించడం ద్వారా జ్ఞానసృష్టికి కారకులౌతారని, అలా ఎవరైతే దీనిని ఒక విధిగా భావించి, ఆ విధిని నిర్వర్తిస్తారో వారిని మేధాపర శ్రామికులుగా గ్రామ్‌షీ పిలిచాడు. ప్రతి వ్యక్తి ఏదో ఒక వృత్తిపై ఆధారపడి జీవిస్తున్నప్పటికీ, అతను నిర్వర్తించే విధి ప్రధానంగా మేధాపరమైనదా, కాదా అనేదే మేధావిగా పరిగణించడానికి ప్రమాణం అవుతుందన్నాడు. ఈ నిర్వచనాన్ని కొంచెం విస్తరించడం ద్వారా, మేధావి అనే భావనకు నూతన అర్థాన్ని గ్రామ్‌షీ చెప్పాడు. ఎవరైతే ఉత్పత్తిరంగంలోను, రాజకీయ, సాంస్కృతిక రంగాలలోను నేతృత్వ విధిని నిర్వర్తిస్తారో వారిని మేధావులుగా పరిగణించవచ్చునన్నాడు. మేధావి అనే భావనకు ఇంత విస్తృత అర్థాన్ని ఇవ్వడం ద్వారా, రచయితలు, కళాకారులు, తత్వవేత్తలతో పాటు, ప్రభుత్వోద్యోగులు, రాజకీయ నాయకులు, ఇంజనీర్లు, శాస్త్రవేత్తలు, సాంకేతిక నిపుణులు కూడా ఈ నిర్వచన పరిధిలోకి వస్తారు. తద్వారా పౌరసమాజంలో ఉత్పాదక, సాంస్కృతిక రంగాలలో నాయకత్వ విధులను నిర్వర్తించే శ్రేణులు, అలాగే రాజ్యానికి సంబంధించిన సంస్థలలో ప్రధాన బాధ్యతలను నిర్వర్తించే వ్యక్తులందరినీ, మేధావులుగా గ్రామ్‌షీ పేర్కొన్నాడు.

ప్రతి సామాజిక వర్గం, తన ప్రయోజనాలను పరిరక్షించుకొనేందుకు, వర్గ ఐక్యతను పెంపొందించుకునేందుకు ఒక మేధావి వర్గాన్ని ఏర్పరచుకొంటుందన్నాడు. ఉదాహరణకు పెట్టుబడిదారీ వర్గం ఆవిర్భవించడంతో పాటు, దాని ప్రయోజనాలను వ్యక్తీకరించే మేధావి వర్గాన్ని తనతోపాటు సృష్టించుకొంటుంది. వర్గాలకు అతీతమైన లేదా తటస్థత కలిగిన మేధావివర్గం ఉండటం పూర్తిగా మిథ్య అన్నాడు.

**సాంప్రదాయిక మేధావులు :**

గ్రామ్‌షీ మేధావులను సాంప్రదాయిక, అనుబంధిత వర్గాలుగా వర్గీకరించాడు. పాత వ్యవస్థకు అనుసంధానంగా వ్యవహరించిన మేధావివర్గాన్ని సాంప్రదాయిక మేధావులుగా పిలువబడ్డారు. ఉదాహరణకు మతాచార్యులు, అలాగే గ్రామీణ భూస్వామ్యవర్గాలకు సన్నిహితంగా వ్యవహరించిన ఉపాధ్యాయులు, ప్రభుత్వోద్యోగులు, న్యాయవాదులు మొదలగువారు పాతవ్యవస్థ నుండి నూతన సామాజిక వ్యవస్థ రూపొందుతున్నప్పటికీ, ఈ సాంప్రదాయిక మేధావి వర్గం ఆ మార్పులో గుణాత్మక లక్షణాన్ని గుర్తించక, ఆ చారిత్రత మార్పు అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్న మార్పుగా వ్యక్తీకరిస్తారు. ఆ సమాజంలోని ఆధిపత్యవర్గాల నుండి తమను తాము స్వతంత్రులుగా గుర్తించుకొన్నప్పటికీ ఈ సాంప్రదాయిక మేధావులు ఆ వర్గ ప్రయోజనాలను పరిరక్షించినవారే1

**అనుబంధిత మేధావులు :**

ఏ సమాజంలోనైనా నూతనవర్గం ఆవిర్భవించినప్పుడు, ఆ వర్గ ప్రయోజనాలను, ఆలోచనలను, ఆకాంక్షలను వ్యక్తీకరించడమే కాక, ఆ వర్గాన్ని సమైక్యపరచడంలోను, సంఘటిత పరచడంలోను ప్రధానపాత్ర వహించే మేధావి వర్గాన్నే అనుబంధిత మేధావివర్గంగా

గ్రామ్‌షీ పిలిచాడు. పెట్టుబడిదారీ వర్గ ప్రయోజనాలను వ్యక్తీకరించే అధ్యాపకులు, తత్వవేత్తలు, ఇంజనీర్లు, పత్రికా విలేకర్లు మొదలగువారు, ఆ వర్గానికి చెందిన అనుబంధిత మేధావి వర్గంగా పిలువబడతారు. ఈ మేధావివర్గం పెట్టుబడిదారీ పౌరసమాజంలో భావజాల ఆధిపత్యాన్ని ఏర్పరచడంలో ముఖ్యపాత్ర వహించడమే కాక, రాజ్యసంస్థలలో పెట్టుబడిదారీ వర్గ ప్రతినిధులుగా వ్యవహరిస్తారు. పాలకవర్గానికి చెందిన అనుబంధిత మేధావివర్గం సాంప్రదాయిక మేధావివర్గాన్ని సైద్ధాంతిక పోరాటం ద్వారా తనవైపు తిప్పుకోవడంలోను, తన శ్రేణులలో కలుపుకోవడం ద్వారా, తాము మరింత ప్రాబల్యశక్తిగా ఎదగడానికి వీలు కలుగుతుంది.

గ్రామ్‌షీ దృష్టిలో అనుబంధిత మేధావులు శ్రామికవర్గానికి కూడ ఎంతో అవసరం. శ్రామికవర్గం తన శ్రేణుల నుండి అనుబంధిత మేధావివర్గాన్ని ఏర్పరచుకోవడం ద్వారా ఒకవైపున సైద్ధాంతిక భావజాల పోరాటం ద్వారా, తన భావజాల ఆధిపత్యాన్ని పౌరసమాజంలో సాధించడం మొదటిది. మరొకవైపున ఉత్పత్తి, రాజ్యసంస్థలలో ఆయా వర్గాలను సమీకరించడంలోను, సంఘటిత పరచడంలో నేతృత్వం వహించడం ద్వారా, శ్రామికవర్గ అనుబంధిత మేధావులు భిన్నవర్గాలకు నాయకత్వం వహించే స్థాయికి ఎదగడం ద్వారానే పెట్టుబడిదారీ వ్యవస్థలో మౌలికమార్పులను తీసుకొని రావడం సాధ్యపడుతుంది. ఆ పాత్రను నిర్వర్తించే శ్రామికవర్గ రాజకీయపార్టీని సమష్టిమేధావిగా గ్రామ్‌షీ పేర్కొన్నాడు.

**భావజాలం :**

పెట్టుబడిదారీ వ్యవస్థ సామ్యవాద వ్యవస్థగా పరిణామం చెందడం ఆ సమాజంలోని ఉత్పత్తి సంబంధాలు ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి అవరోధంగా ఉన్నప్పుడు ఏర్పడే వైరుధ్యాల ఫలితంగానే నూతన వ్యవస్థ నిర్మాణానికి దారితీస్తుందన్న సాంప్రదాయిక మార్క్సిస్ట్ విశ్లేషణకు, గ్రామ్‌షీ అంత ప్రాధాన్యతను ఇవ్వలేదు. పెట్టుబడిదారీ సమాజంలో చారిత్రక మార్పులు ఆ వ్యవస్థ యొక్క అంతరంగిక చలన సూత్రాల ఆధారంగానే జరుగుతాయన్న నియతివాదాన్ని గ్రామ్‌షీ అంగీకరించలేదు. ఏ సమాజంలోనైనా మార్పులు, మానవ ప్రయత్నం ద్వారానే సాధించబడతాయని, అయితే ఆ సమాజ చారిత్రక క్రమాన్ని, వర్గ వైరుధ్యాలను, భావజాల ప్రాబల్యం మొదలైన అంశాలను స్పష్టంగా అర్థం చేసుకొని మార్పుకొరకు ప్రయత్నించినట్లయితే, మార్పు ఆచరణసాధ్యం అవుతుందని గ్రామ్‌షీ చెప్పాడు. ఈ మార్పుని సాధ్యపరచడంలో మేధావుల పాత్ర, శ్రామికవర్గం ఇతర మిత్ర వర్గాలతో ఏర్పరచుకొనే సయోధ్యపై గ్రామ్‌షీ ఎక్కువగా తన దృష్టిని కేంద్రీకరింపచేశాడు. ఈ దృష్టి నుండి విశ్లేషిస్తూ, సామ్యవాద వ్యవస్థను కాంక్షించే భావజాలం, పెట్టుబడిదారీ సమాజ గర్భంలోనే ఆధిపత్యాన్ని పొందకుండా, సామ్యవాదం వైపుకు ఆ సమాజాన్ని మరల్చడం కష్టం అన్నాడు. ఈ క్రమంలో భావజాలం భౌతికశక్తిగా ఎలా మారుతుందో గ్రామ్‌షీ వివరించాడు.

**భావజాలం - భిన్న నిర్వచనాలు :**

సారూప్యభావాలను, విశ్వాసాలను ఒక సైద్ధాంతిక చట్రం ద్వారా వ్యక్తీకరించబడే భావ సముదాయాన్నే భావజాలం అంటారు. ఏ భావజాలమైనా అధికారంతో అత్యంత సాన్నిహిత్యాన్ని కలిగి ఉంటుంది. ఆధిపత్య వర్గాల ప్రయోజనాలను సమర్థిస్తూ ప్రజల ఆమోదాన్ని పొందిన భావాలు, విశ్వాసాల సమాహారాన్ని, భావజాలంగా ఆంటోని గిడ్డెన్స్ అనే బ్రిటిష్ సామాజిక శాస్త్రవేత్త, భావజాలాన్ని సులువైన రీతిలో నిర్వచించాడు. భావజాలం ఎప్పుడూ సమాజంలోని అసమాన ప్రాబల్య సంబంధాలను సమర్థిస్తుంది. సాంప్రదాయిక మార్క్సిస్ట్ సిద్ధాంతం మౌలికంగా పాలకవర్గం యొక్క ఆధిపత్యానికి మూలం బలం లేదా నియంత్రణపై ఆధారపడి ఉంటుందని వివరిస్తుంది. ఇందుకు భిన్నంగా ఏ నియంతృత్వ ప్రభుత్వం కూడ పోలీస్, సైన్యంపై ఆధారపడి ఎక్కువకాలం పాటు ప్రజానీకాన్ని పాలించలేదని, భావజాల ప్రాతిపదికపై ప్రజాసమ్మతిని పొందడంపైనే తన ఆధిపత్యాన్ని కొనసాగిస్తుందని గ్రామ్‌షీ చెప్పాడు. భావజాలం ప్రజల ప్రవర్తనను, నైతిక దృక్పథాన్ని ప్రభావితం చేస్తుంది. అలాగే ప్రజల సామూహిక జీవనంలో ఇమిడి ఉంటుంది. ప్రజల జీవన చర్యలను నిర్దేశించే సామాజిక సంస్థల నిర్మాణాలలో భావజాలం వ్యవస్థీకృతం అయి ఉంటుంది. ఉదాహరణకు పౌరసమాజానికి చెందిన కార్మికసంఘాలు, రాజకీయపార్టీలు, అలాగే రాజ్యసంస్థలైన న్యాయస్థానాలు, చట్టసభలు, ఆర్థిక రంగానికి చెందిన పారిశ్రామిక, వ్యాపార సంస్థలు ఏదో ఒక భావజాల అంశంపై ఆధారపడి వాటి విధులను నిర్వర్తిస్తుంటాయి. ఈ సంస్థలన్నియూ ఆ సంస్థల పరిధిలోనికి వచ్చిన ప్రజలను ప్రభావితం చేస్తుంటాయి. ఉదాహరణకు, భావజాల అంశమైన చట్టం మానవ ప్రవర్తనను ప్రగాఢంగా ప్రభావితం చేస్తుంది. కావున భావజాలం సామాజిక ఆచరణలలో అంతర్భాగం కావడం ద్వారా, భావజాలం భౌతిక రూపాన్ని కలిగి ఉంటుందని గ్రామ్‌షీ అభిప్రాయం.

అదే సమయంలో భావజాలాలను సామాజిక ఆచరణలకు మాత్రమే పరిమితం చేయరాదు. భావజాలం, భౌతికరూపాన్ని సంతరించుకోవడమే కాకుండా, భావరూపంలోనే వివిధ భావనల చట్రరూపంలో వివిధ సామాజిక, రాజనీతి సిద్ధాంతాల ద్వారా సమాజంపై తన ప్రభావాన్ని చూపుతుంది.

**భిన్న సమూహాల, వర్గాల కలయికలో భావజాల పాత్ర :**

భావజాల స్వభావాన్ని వాస్తవ, అవాస్తవాల ఆధారంగా అంచనా వేయరాదని, అది ఏ మేరకు భిన్న సామాజిక వర్గాలను ఐక్యపరచగలదన్న దానిపై ఆధారపడి నిర్ణయానికి రావాలని గ్రామ్‌షీ భావిస్తాడు. ఏ సామాజిక వర్గం, ఇతరవర్గాల, సమూహాల ప్రయోజనాల మధ్య సమన్వయం సాధిస్తుందో, దానిని ఆధిపత్య వర్గంగా గుర్తింపబడుతుంది. ఈ భిన్న వర్గాల మధ్య రాజకీయ ఐక్యత భావసారూప్యత ద్వారా, ఒక ఉమ్మడి ప్రాపంచిక దృక్పథం ద్వారా సాధించబడుతుంది. ఏ వర్గమైనా ఆధిపత్యవర్గంగా

అంగీకరించబడాలంటే, మిగతా వర్గాల, సమూహాల ప్రజాస్వామ్య ఆకాంక్షలను, ఆయా సమూహాల చారిత్రక, సాంస్కృతిక ప్రత్యేకతలను గుర్తించినపుడే వీలవుతుంది. ఒక వర్గం ఆధిపత్య వర్గంగా మారే క్రమంలో, ఇతర వర్గాల ప్రయోజనాలూ, ఆకాంక్షలనూ, తన భావజాల చట్రంలో పొందుపరపబడినపుడు ఆ వర్గాల మధ్య ఐక్యత వీలవుతుంది. ఈ ఐక్యత రాజకీయ ఆర్థిక పోరాటాల క్రమంలో క్రమేణా సాధించబడుతుందే తప్ప, ఒక్కసారిగా ఏర్పడేది కాదు.

**భావజాలం లోకజ్ఞానం పాత్ర వహించడం :**

భావజాలానికి సామూహిక చైతన్యానికి మధ్య ఉండే సంబంధం ముందుపేరాలలో వివవరించబడినది. అయితే భావజాలానికి వ్యక్తి లోకజ్ఞానానికి మధ్య ఉండే సంబంధం ఏమిటి? ప్రతిమనిషి స్వానుభవంలో తన చుట్టూ ఉండే ప్రపంచానికి సంబంధించిన అనేక విషయాలను గ్రహిస్తాడు. వ్యక్తి తన చుట్టూ ఉండే ప్రపంచాన్ని తొలుత యధావిధిగా విమర్శనారహితంగా, అప్రయత్నంగా గ్రహించడాన్నే లోకజ్ఞానం అంటారు. పౌరసమాజంలో భావజాల ఆధిపత్యం లోకజ్ఞానం పై ఆధారపడి ఉంటుందని గ్రామ్‌షీ భావించాడు. వ్యక్తి స్వానుభవం నుండి ప్రపంచానికి సంబంధించి అనేక సూత్రీకరణలు చేస్తాడు. వ్యక్తిగత అనుభవం ఆధారంగా ఏర్పరచుకొనే ప్రాపంచిక దృక్పథాన్ని యాధృచ్ఛికంగా తత్వశాస్త్రంగా గ్రామ్‌షీ పేర్కొన్నాడు. ఈ లోకజ్ఞాన ప్రాతిపదికపై ఆధారపడి ఆధిపత్య భావజాలం రూపొందించబడుతుండగా, ఆ లోకజ్ఞానంపైనే ఆధారపడే కార్మికవర్గం తన ప్రతిఘటనను కొనసాగిస్తుంది. పెట్టుబడిదారీ వర్గం ఆధిపత్య భావజాలానికి చొరవతో కూడిన సమ్మతిని పొందేందుకు ప్రయత్నిస్తుంది. కాబట్టి ఈ లోకజ్ఞానాన్ని విమర్శనాయుతజ్ఞానం వైపుకు మరల్చడం ద్వారా, వ్యక్తికి మరింత స్పష్టమైన, చైతన్యపూరిత స్పృహ ఏర్పరచడం ద్వారా, మార్క్సియన్ సిద్ధాంతం ఆ ఆధిపత్య భావజాలాన్ని ప్రశ్నింపచేయగలుగుతుంది.

పెట్టుబడిదారీ సమాజాలలో వ్యవస్థీకృతమైన ఆధిపత్య భావజాలాన్ని, ప్రత్యామ్నాయ భావజాలం ద్వారానే ప్రతిఘటించవలసి ఉంటుంది. ఈ పనిని శ్రామికవర్గ అనుబంధిత మేధావివర్గం ఎంత సృజనాత్మకంగా నిర్వర్తించగలిగితే, ఆ సమాజం సామ్యవాదంవైపు అంత త్వరితగతిన పయనించగలదు. ❑

# ఐదు దశాబ్దాల క్రీడా వికాసం

జిఎస్.రాంమోహన్

(గత సంచిక తరువాయి)

**అరువు ఆటగాళ్లు-అత్యుత్తమ ఫలితాలు**

హైదరాబాద్‌లో జరిగిన 2002 జాతీయ క్రీడలది (ఇందులో కొన్ని పోటీలను విశాఖపట్నంలో కూడా నిర్వహించారు.) పూర్తిగా వేరే కథ. ఈ క్రీడలు హైదరాబాద్‌లో జరుగుతాయని ప్రకటించే సన్నివేశంలో భారత ఒలింపిక్ అధ్యక్షుడు సురేశ్ కల్మాడీ ఒక మాటన్నారు. నభూతో అన్నట్టు నిర్వహిస్తామని ముఖ్యమంత్రి చంద్రబాబు అంటే నిర్వహించడమొక్కటే కాదు, ఫలితాలు కూడా అదే స్థాయిలో ఆంధ్రప్రదేశ్ సాధించాలని సురేశ్ కల్మాడీ నవ్వుతూ అన్నారు. దీనికి జవాబును చంద్రబాబు ఆచరణలో చూపించారు. కాకపోతే దానికి ఆయన ఎంచుకున్న మార్గమే చిత్రమైనది. అనూహ్యమైనది. పతకాలు సాధించే అవకాశమున్న ఇతర రాష్ట్రాల క్రీడాకారులను ఆయన అరువు తెచ్చారు. మెరుగైన తాయిలాలు చూపి రాష్ట్రానికి రప్పించారు. దేశంలో మున్నెన్నడూ లేని విధంగా జాతీయ క్రీడల్లో రాష్ట్రం తరపున స్వర్ణం గెలిచిన వారికి మూడు లక్షలు, రజత పతక విజేతలకు రెండు లక్షలు, కాంస్య పత˘ విజేతలకు ఒక లక్ష చొప్పున ప్రకటించారు. రాచమర్యాదలతో ఇతర రాష్ట్రాల క్రీడాకారులను తెచ్చి రాష్ట్రంలో ఘనంగా ఏర్పాట్లు చేశారు. దేశవ్యాప్తంగా పతకాలు గెలవడానికి అవకాశమున్న ప్రతి క్రీడాకారుడికి, క్రీడాకారిణికి ఎరవేశారు. ఇంకేముంది? జాతీయ తారలంతా బారులు తీరారు. ఆంధ్రప్రదేశ్ అగ్రతాంబూలం దక్కించుకుంది. 93 స్వర్ణాలు, 85 రజతాలు, 63 కాంస్యాలు వెరసి 241 పతకాలతో సరికొత్త రికార్డు సృష్టించింది. ఉత్తర ప్రదేశ్‌కు చెందిన రన్నర్ గులాబ్ చంద్ రాష్ట్రం తరపున బరిలో దిగి మూడు స్వర్ణాలు తెచ్చిపెట్టాడు. మాధురి ఎ సింగ్ రెండు బంగరు పతకాలను జత కలిపింది. హర్వాంత్ కౌర్ డిస్కస్, షాట్‌పుట్‌లలో చెరొకటి చొప్పున పసిడి పతకాలను జోడించింది. మణిదీప్ కుమార్ స్టిపుల్ ఛేజ్ లోనూ అరుణ్ డిసౌజా డెక్లాథాన్‌లోనూ సరికొత్తరికార్డు సృష్టించి ఆంధ్ర పతకాల జాబితా పొడవు పెంచారు. షూటర్ సమరేశ్ జంగ్ పసిడి తెచ్చిపెట్టాడు. ఈ జాబితా ఇలా రాసుకుంటూ పోతే కొండవీటి చేంతాడంత అవుతుంది. ఈ వాపు తీసేసి బలుపు గురించే మాట్లాడుకుంటే ఈగేమ్స్‌లో నిజంగా ఆంధ్రను మెరిపించిన వారిలో మచ్చుకు ఇద్దరమ్మాయిల పేర్లు చెప్పుకోవచ్చు.. ఒకరు హెప్టాథ్లాన్‌లో జాతీయ రికార్డు స్థాపించిన, అంతర్జాతీయ స్థాయికెదగలదని ఆశలు కల్పించిన జెజె శోభ. మరొకరు టెన్నిస్ యువకెరటం సానియా మీర్జా. చిత్రమైన విషయమేమిటంటే ఆమె సింగిల్స్ ఫైనల్స్‌లో 6-0,6-0 తేడాతో ఓడించిన ప్రత్యర్థి పేరు మనీషా మల్హోత్రా. ఆమె కూడా "ఆంధ్రప్రదేశ్ క్రీడాకారిణే". అదెలా? మన పేరులా లేదు, తర్వాత ఎక్కడా కనిపించడం లేదు అనుకుంటున్నారా? ఆమె కూడా ఉత్తర ప్రదేశ్‌నుంచి ఆంధ్రప్రదేశ్‌కు ఈ క్రీడల కోసమై దిగుమతి చేసుకున్న మనిషి! రహదారి ఏదైతేనేం చంద్రబాబు అనుకున్నది సాధించారు. కాకపోతే ఇదేం పద్ధతి అని ఇతర రాష్ట్రాలు చీకొట్టాయి. తుడిచేసుకోగలిగితే పతకాలే పతకాలు!! ఆ జాతీయ క్రీడలు జరిగినన్నాళ్లూ గచ్చిబౌలి స్టేడియంలో ఆటల కంటే కూడా దీనిపైనే ప్రధానమైన చర్చ. ప్రపంచం చంద్రబాబును అర్థం చేసుకోలేకపోయింది. వారికి ఆయన స్థాయి లేకపోయింది మరి! "మేం మెరుగైన సౌకర్యాలు, ధన సహాయం ప్రకటించాం, వారొచ్చారు తప్పేముంది" అని నాటి ఎక్సైజ్, ప్రొహిబిషన్ మంత్రి తమ్మినేని సీతారాం విమర్శలకు బదులిచ్చారు. మా కరణం మల్లీశ్వరి హర్యానా తరపున చాలా కాలంగా ఆడుతోంది. మేం ఏమన్నా అన్నామా అని కూడా ఆయన ప్రశ్నించారు. అచ్చుగుద్దినట్టు హావభావాల్లో చంద్రబాబు గారిని అనుకరించే మాజీ మిన్స్టర్ ఆంధ్రా సీతారాం జాతీయ క్రీడలకు కొద్ది కాలం ముందు వరకూ అంటే సన్నాహక దశల్లో క్రీడామంత్రిగా పనిచేశారు. ఈ క్రీడాకారుల దిగుమతి పాలసీలో కీలక పాత్ర పోషించారు. మల్లీశ్వరి హర్యానాలో పెళ్లిచేసుకుని అక్కడే సెటిలయిపోయి ఆ రాష్ట్రం తరపున ఆడుతున్నది. కానీ మనం దిగుమతి చేసుకున్న క్రీడామందకు ఆ లాజిక్ ఏరకంగానూ వర్తించదు. వీళ్లు కొలు ఒప్పందం ప్రకారం ఆ క్రీడల వరకూ ఆంధ్ర తరపున ఆడేసి ఎవరి డబ్బు వారు తీసుకుని తిరిగి స్వస్థలాలకు వెళ్లిన వారు. సీతారాం సరే! ముఖ్యమంత్రి బాబుగారైతే సాంకేతికంగా అలా దిగుమతి చేసుకోవడానికి ఉన్న అవకాశాలను ఏకరువు పెట్టారు.ఈ సాంకేతిక భాష కూడా అనేకమందికి అర్థం కాలేదు. పాలకులు కూడా విలువల భాష పూర్తిగ మర్చిపోయి ఇది ఏ చట్టం ప్రకారం నేరమో చెప్పండి అంటూ సాంకేతికాంశాలను ముందుకుతెస్తే జీర్ణం చేసుకునే స్థాయికి జనం ఇంకా చేరుకోలేదు. రాజకీయాలు ఎంత దిగజారిపోయాయనుకున్నా నాయకులు కనీసం మాటల వరకైనా ఇంకా విలువల జపం చేస్తూనే ఉన్నారు. బాబుగారు హైటెక్ మనిషి కాబట్టి ఇందులోనూ ఎవరూ అందుకోలేని స్థాయికి వెళ్లిపోయారు. ఏమైనా ఒక్కసారిగా ఉబ్బిపోయిన ఆంధ్రప్రదేశ్ పతకాల జాబితా ఆయన

అనుకున్నట్టుగా గౌరవమర్యాదలనైతే సంపాదించలేకపోయింది. తద్విరుద్ధమైన ఫలితాన్ని ఇచ్చింది. రామాయణంలో పిడకల వేటలాగా మధ్యలో  చంద్రబాబు గురించి ఇంత అవసరమా అనిపించవచ్చు. కానీ క్రీడల్లో పతకాలు సాధించడానికి ఆయన చూపించిన ఈ మార్గం అపూర్వమైనది. ఇది నాయకుల విధానాల్లో ఆలోచనల్లో వచ్చిన మార్పులకు పెనుసంకేతం. ఒక రకంగా వక్తిగత ప్రతిష్ఠ కోసం ఆయన కోట్లాది రూపాయల ప్రజాధనాన్ని గుమ్మరించి బంగారు పతకాలను కొనుగోలు చేశారు. అంతకంటే ఈ ఎపిసోడ్‌లో అర్థమయ్యేది మరోటి లేదు. అంతర్జాతీయ స్థాయిలో  ఫుట్‌బాల్ క్లబ్బులు, క్రికెట్ కౌంటీల్లో ఈ ఆనవాయితీ ఉన్నా అవి పూర్తిగా వ్యాపారమయమైనవి. అలాగే మెరుగైన సౌకర్యాల కోసమో మౌలిక సదుపాయాల కోసమో ఎవరైనా ఒకటీ అరా క్రీడాకారులు వక్తిగత స్థాయిలో వేరే రాష్ట్రాలకు వలస పోవడమూ కొత్త విషయం కాదు. ఉదాహరణకు త్రిపురలో సరైన సౌకర్యాలు లేక సరస్వతీ సాహ బెంగాల్‌కు వలసపోయింది. అటువంటి వాటిని అర్థం చేసుకోవచ్చు. కానీ ఒక రాష్ట్ర పాలకుడు పతకాల జాబితాలో అగ్రగామిగా కనిపించడం కోసం ఇతర రాష్ట్రాల క్రీడాకారులను టోకున గుత్తకు తీసుకోవడం మాత్రం ఇదే ప్రథమం. ఆయన సరికొత్త ఆనవాయితీని సృష్టించారు. రేపు ఇంతకంటే గుమ్మరించగలిగిన మరో ముఖ్యమంత్రి ఇంతకంటే టోకున క్రీడాకారులను కొలుకు తీసుకోవచ్చు. అప్పుడు మండల, డివిజన్, జిల్లా స్థాయిల్లో పోటీలకు గాని వాటి ప్రాతిపదికగా రాష్ట్ర జట్లను ఎంపిక చేయడానికి గాని మొత్తంగా జాతీయ క్రీడలకు గాని అర్థం పరమార్థం ఏమైనా ఉంటుందా? దాని స్ఫూర్తి ఏమైనా మిగులుతుందా? అన్నింటి కన్నా అన్యాయమైనది అప్పటి వరకూ జాతీయ క్రీడల్లో ప్రతిభ నిరూపించుకోవాలని తపనబడిన రాష్ట్ర క్రీడాకారుల పరిస్థితి ఏమిటి? పతకాలు గెలవగలిగిన పందెపు పోతులను అన్ని రాష్ట్రాల నుంచి ఏరి తేవడం  వల్ల చాలా మంది రాష్ట్ర క్రీడాకారులకు జాతీయ క్రీడల్లో బరిలోకి దిగే అవకాశం లేకుండా పోయింది. వారు నిరసన కూడా వ్యక్తం చేశారు. వారి గోడు పట్టించుకున్న నాథుడే లేడు.

ఈ గొడవనలా పక్కన బెడితే చంద్రబాబు పుణ్యమా అని హైదరాబాద్‌లో క్రీడా మౌలిక వసతులు భారీ స్థాయిలో అభివృద్ధి అయ్యాయి. అంతర్జాతీయ స్థాయి కలిగిన స్టేడియాలు మన భాగ్యనగరాన నిర్మితమయ్యాయి. హైదరాబాద్ పరిసరాల్లోని గచ్చిబౌలి దగ్గర 50 ఎకరాల స్థలంలో 130 కోట్ల రూపాయల ఖర్చుతో క్రీడాగ్రామం నిర్మించారు. కళ్లు చెదిరే రీతిలో ఏడు స్టేడియాలు భాగ్యనగరాన నిర్మించారు. ఆ స్టేడియాలు, వాటి ఖర్చు వివరాలు ఇవీ...

1)-గచ్చిబౌలి ప్రధాన అథ్లెటిక్ స్టేడియం-20 కోట్ల 90 లక్షల రూపాయలు

2)-గచ్చిబౌలి బహుళ ప్రయోజనకర ఇండోర్ స్టేడియం-11 కోట్ల లక్ష రూపాయలు

3)-గచ్చిబౌలి ఆక్వాటిక్ కాంప్లెక్స్(ఈతకొలనుల సముదాయం)-9 కోట్ల 61 లక్షల రూపాయలు

4)-యూసఫ్ గూడ(విజయభాస్కర రెడ్డి) ఇండోర్ స్టేడియం-8 కోట్ల 94 లక్షల రూపాయలు

5)-సరూర్ నగర్ ఇండోర్ స్టేడియం-8 కోట్ల 69 లక్షలు

6)-ఫతేమైదాన్ టెన్నిస్ స్టేడియం-5 కోట్ల 87 లక్షలు

7)-ఉస్మానియా యూనివర్శిటీ వెలోడ్రోమ్(సైక్లింగ్)-5 కోట్ల 64 లక్షలు

(ఆధారం -పిఐబి ఫీచర్స్ 2000)

ఇవి కాకుండా అప్పటికే భాగ్యనగరాన ఉన్న లాల్ బహదూర్‌స్టేడియం, గోషామహల్ స్టేడియం, బేగంపేట పోలీస్ హాకీ స్టేడియం, ఎన్టీఆర్ స్టేడియం, గోషా మహల్ శివకుమార్ లాల్ ఫుట్‌బాల్ స్టేడియం, సికింద్రాబాద్ జింఖానా స్టేడియం మొదలైన వాటికి మెరుగులు దిద్దారు.తర్వాత భాగ్య నగరాన జరిగిన మరో క్రీడా సంరంభం ప్రథమ ఏఫ్రో ఆసియన్ గేమ్స్ సందర్భంగా వాటికి మరింత మెరుగులు దిద్దారు. జాతీయ క్రీడలు, ఏఫ్రో ఏసియన్ క్రీడలు రెంటినీ కూడా చంద్రబాబు ప్రభుత్వం అట్టహాసంగా నిర్వహించింది. భారీ స్థాయిలో ఏర్పాట్లు చేసి ఆహుతుల మన్ననలు పొందింది. 2010లో కామన్వెల్త్ గేమ్స్ ఢిల్లీలో జరగనున్నాయి కాబట్టి హైదరాబాద్‌కు ఏ ఆసియాడో, ఒలింపిక్సో కేటాయించాలని సభాముఖంగానే చంద్రబాబు కేంద్రాన్ని కోరారు-సింపుల్‌గా. ఆంధ్రప్రదేశ్‌ను ప్రపంచ క్రీడారాజధానిగా మారుస్తామని కూడా ప్రకటించారు. నిజానికి హైదరాబాద్‌ను అన్ని రంగాల్లో ప్రపంచ రాజధానిగా చూడాలన్నది ఆయన వాంఛ. నెక్లెస్ రోడ్‌లో ఏదైనా పర్యాటక కార్యక్రమం జరిగితే హైదరాబాద్ ప్రపంచ పర్యాటక రాజధాని అవుతుంది. ఏదైనా ఆర్థిక సమావేశం జరిగితే ప్రపంచ ఆర్థిక రాజధాని అవుతుంది. సాఫ్ట్ వేర్ కార్యక్రమమయితే ప్రపంచ సాఫ్ట్‌వేర్ రాజధాని అవుతుంది. కార్యక్రమాన్ని బట్టి మధ్యలో పదమొక్కటే మారుతూ ఉంటుంది.అంతా బాగానే ఉంది. హైదరాబాద్‌లో క్రీడావసతుల అభివృద్ధిని కచ్చితంగా అభినందించాల్సిందే. ఆటగాళ్లకు గ్లామర్ పెంచి పట్టణ యువత క్రీడల వైపు చూసేలా చేయడంలో ఆయన పాత్రను విస్మరించడానికి వీల్లేదు. అయితే అదే సమయంలో జిల్లాల పరిస్థితి ఎలా ఉంది అనేది కూడా చూడాలి.  జిల్లాల్లో  నిర్మించదలపెట్టిన 63 నిర్మాణాలు( స్టేడియాలు, స్పోర్ట్స్ కాంప్లెక్సులు, స్విమ్మింగ్ పూల్స్) నిధులు లేక మూలన బడి వున్నాయి.వీటిలో కొన్ని మొదలే కాకపోగా కొన్ని మొదలై నిలిచిపోయాయి. అతి కొద్ది నిర్మాణాల విషయంలో మాత్రం పనులు నడుస్తున్నాయని ప్రభుత్వం పేర్కొంది.  వీటిలో 1994లో మొదలెట్టి వదిలేసినవీ ఉన్నాయి. మధ్యకాలంలో మొదలుపెట్టినవీ ఉన్నాయి. దాదాపు అన్ని జిల్లాలకు సంబంధించి ఉన్నాయి. వీటిలో మెజారిటీ నిర్మాణాలు నిలిచిపోవడానికి కారణం నిధుల లేమి అని ప్రభుత్వమే పేర్కొంది. కొన్నింటికి

మాత్రం భూసేకరణ సమస్యగా ఉందని తెలిపింది.. నిధుల లేమి నిజమేనా? అసలు మొత్తం నిర్మాణాల అంచనా వ్యయం ఎంతో తెలుసా? కేవలం 30.8 కోట్లు. హైదరాబాద్‌లో వందల కోట్ల కొలదీ ఖర్చుపెడుతున్న ప్రభుత్వం దగ్గర ఆ మాత్రం డబ్బు లేకపోయిందా! లేక నిర్లక్ష్యమా! దీనికి వేరే వివరణ కూడా అనవసరం. ముంజేతి కంకణానికి అద్దమెందుకు? భూసేకరణ సమస్య కూడా అంతే. నాగర్ కర్నూల్‌లో, ఆళ్లగడ్డలో కొన్ని సెంట్ల భూమి సేకరించడం సమస్యగా మారిందట ప్రభుత్వానికి!!

జిల్లాల్లో నిలిచిపోయిన, కొనసాగుతూనే వున్న నిర్మాణాలు, వాటి వివరాలు ఇవీ...

(రు. లక్షలలో)

| స్టేడియం పేరు, నిర్మాణం ప్రారంభించిన సంవత్సరం | అంచనా వ్యయం | వ్యయం | రిమార్కులు |
|---|---|---|---|
| మినీ ఇండోర్ స్టేడియం, ఉరవకొండ, అనంతపురం జిల్లా. జూలై 2000 | 10.50 | 5.89 | నిధుల కొరత |
| అవుట్‌డోర్ స్టేడియం, కదిరి, అనంతపురం జిల్లా. జూలై 1999 | 29.50 | 10.00 (ACDP funds) | నిధుల కొరత |
| మినీ స్టేడియం, మెట్‌పల్లి, కరీంనగర్ జిల్లా. నవంబర్, 1999. | 40.00 | 27.00 | నిధుల కొరత |
| మినీ స్టేడియం, జగిత్యాల, కరీంనగర్ జిల్లా. మే 1998 | 25.32 | 6.89 | నిధుల కొరత |
| మినీ స్టేడియం, బెజ్జంకి, కరీంనగర్ జిల్లా. | 28.30 | 3.00 | నిధుల కొరత |
| మినీ స్టేడియం, హుస్నాబాద్, కరీంనగర్ జిల్లా. నవంబర్ 2000 | 20.00 | 3.00 | నిధుల కొరత |
| జిల్లా స్థాయి స్పోర్ట్స్ కాంప్లెక్స్, నంద్యాల, కర్నూలు జిల్లా. ఫిబ్రవరి 1994 | 100.20 | 5.00 | నిధుల కొరత |
| ఇండోర్ స్టేడియం, నగరం, నిజామాబాద్ జిల్లా. మే 1993 | 10.00 | 22.00 | నిధుల కొరత |
| మినీ స్టేడియం, తాడ్వాయి, నిజామాబాద్ జిల్లా. ఫిబ్రవరి 1999 | 14.00 | 2.50 | నిధుల కొరత |
| మినీ స్టేడియం, ఉట్నూర్, ఆదిలాబాద్ జిల్లా. జనవరి 1999 | 5.00 | 3.26 | నిధుల కొరత |
| మినీ స్టేడియం, నిర్మల్, ఆదిలాబాద్ జిల్లా. జనవరి 1998 | 25.00 | 27.50 | భూసేకరణ సమస్య నిధుల కొరత |
| మినీ స్టేడియం, ఆత్మకూర్, మహబూబ్‌నగర్ జిల్లా. జూలై 1999 | 24.00 | 14.95 | నిధుల కొరత |
| మినీ స్టేడియం, సిద్దిపేట్, మెదక్ జిల్లా. మార్చి 1996 | 69.20 | 5.00 | నిధుల కొరత |
| మినీ స్టేడియం, జోగిపేట్, మెదక్ జిల్లా. మే 1999 | 13.00 | 5.00 | నిధుల కొరత |
| జిల్లా స్పోర్ట్స్ స్టేడియం, ఆదిలాబాద్ జిల్లా. జనవరి 1994 | 203.00 | 77.85 | నిధుల కొరత |
| ఇండోర్ స్టేడియం, నెల్లూరు జిల్లా. ఫిబ్రవరి 1994 | 74.73 | 103.93 | నిధుల కొరత |
| అవుట్‌డోర్ స్టేడియం, గూడూరు, నెల్లూరు జిల్లా. మే 1999 | 12.50 | 4.90 | నిధుల కొరత |

(రు. లక్షలలో)

| స్టేడియం పేరు, నిర్మాణం ప్రారంభించిన సంవత్సరం | అంచనా వ్యయం | వ్యయం | రిమార్కులు |
|---|---|---|---|
| మినీ స్టేడియం, వెంకటగిరి, నెల్లూరు జిల్లా. మార్చి 1998 | 12.50 | 4.90 | నిధుల కొరత |
| మినీ స్టేడియం, భద్రాచలం, ఖమ్మం 1999 | 5.00 | - | భూసేకరణ సమస్య |
| మినీ స్టేడియం, మంచిర్యాల, ఆదిలాబాద్ జిల్లా. 1998 | 15.00 | - | భూసేకరణ సమస్య |
| మినీ స్టేడియం, నాగర్ కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లా 1999 | వివరాలు లేవు | | భూసేకరణ సమస్య |
| మినీ స్టేడియం, ఏటూరు నాగారం, వరంగల్ జిల్లా 1999 | 25.00 | - | భూసేకరణ సమస్య |
| ఇండోర్ స్టేడియం, ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా 1997 | వివరాలు లేవు | - | భూసేకరణ సమస్య |
| మినీ అవుట్‌డోర్ స్టేడియం, బనగానిపల్లి, కర్నూలు జిల్లా 1999 | వివారాలు లేవు | - | భూసేకరణ సమస్య |
| స్పోర్ట్స్ స్టేడియం, ఎ.పి. భవన్, న్యూఢిల్లీ. 2000 | వివరాలు లేవు | - | నిధుల కొరత |
| మినీ స్టేడియం, షాద్‌నగర్, మహబూబ్‌నగర్ జిల్లా 1994 | 17.50 | | భూసేకరణ సమస్య |
| ఇండోర్ స్టేడియం, ఎమ్మిగనూర్, కర్నూలు జిల్లా 1997 | వివరాలు లేవు | - | ఐ.డి.యస్.ఎమ్.టి. స్కీము కింద తీసుకోవడమైనది. |
| ఇండోర్ స్టేడియం, తుని, తూర్పు గోదావరి జిల్లా 1996 | 100.00 | 2.73 | భూసేకరణ సమస్య |
| స్పోర్ట్స్ కాంప్లెక్స్, మిర్యాలగూడ, నల్గొండ జిల్లా 1996 | 30.00 | 5.00 | చాలినంత భూమి లేదు. |
| మినీ స్టేడియం, నారాయణపేట్, మహబూబ్‌నగర్ జిల్లా. ఫిబ్రవరి 1999 | 24.00 | 17.00 | నిధుల కొరత |
| ఇండోర్ స్టేడియం, ఇంకొల్లు, ప్రకాశం జిల్లా. మార్చి 2002 | 35.00 | - | పనులు మొదలే కాలేదు |
| ఇండోర్ స్టేడియం, అనంతపూర్ జిల్లా | 98.03 | 54.00 | 70% పనులు పూర్తి అయినవి. |
| స్విమింగ్ పూల్, చిత్తూరు జిల్లా | 55.45 | 5.00 | పనులు సాగుతున్నాయి. |
| ఇండోర్ స్టేడియం, చిత్తూరు. | 101.60 | - | నిధుల కొరత |
| స్విమింగ్ పూల్, కాకినాడ. | 53.71 | 15.00 | పనులు సాగుతున్నాయి. |
| ఇండోర్ స్టేడియం, కాకినాడ. | 102.99 | 9.00 | పనులు సాగుతున్నాయి. |
| స్విమింగ్ పూల్, గుంటూరు. | 132.94 | 3.25 | భూ సేకరణ సమస్య |
| హాకీ ఫీల్డ్, గుంటూరు. | 3.94 | - | భూ సేకరణ సమస్య |
| హ్యాండ్ బాల్ కోర్టు, గుంటూరు. | 0.88 | - | భూ సేకరణ సమస్య |

(రు. లక్షలలో)

| స్టేడియం పేరు, నిర్మాణం ప్రారంభించిన సంవత్సరం | అంచనా వ్యయం | వ్యయం | రిమార్కులు |
|---|---|---|---|
| స్విమింగ్ పూల్, కరీంనగర్. | 52.20 | 10.00 | పనులు సాగుతున్నాయి. |
| ఇండోర్ స్టేడియం, కరీంనగర్. | 163.30 | 10.00 | పనులు సాగుతున్నాయి. |
| స్విమింగ్ పూల్, మహబూబ్‌నగర్. | 55.26 | 45.00 | పనులు సాగుతున్నాయి. |
| స్విమింగ్ పూల్, సంగారెడ్డి, మెదక్ జిల్లా | 54.51 | - | |
| ఇండోర్ స్టేడియం, మెదక్. | 101.60 | - | |
| స్విమింగ్ పూల్, నెల్లూరు. | 52.98 | 30.00 | పనులు సాగుతున్నాయి. |
| స్విమింగ్ పూల్, నిజామాబాద్.<br>స్విమింగ్ పూల్ , ఒంగోలు. | 52.63<br>115.75 | 37.50<br>- | పనులు సాగుతున్నాయి.<br>భూసేకరణ సమస్య |
| ఇండోర్ స్టేడియం, ఒంగోలు. | 49.28 | - | భూసేకరణ సమస్య |
| అవుట్‌డోర్ స్టేడియం, ఒంగోలు. | 49.28 | - | భూసేకరణ సమస్య |
| స్విమింగ్ పూల్, రంగారెడ్డి జిల్లా, సరూర్‌నగర్. | 99.12 | 24.08 | పనులు సాగుతున్నాయి. |
| 400 మీటర్ ట్రాక్, సరూర్ నగర్, రంగారెడ్డి జిల్లా. | 10.70 | - | |
| స్విమింగ్ పూల్, శ్రీకాకుళం. | 55.72 | 51.00 | పనులు సాగుతున్నాయి. |
| స్విమింగ్ పూల్, విజయనగరం. | 51.54 | 45.00 | |
| ఇండోర్ హాల్, విజయనగరం. | 102.30 | - | |
| స్విమింగ్ పూల్, వరంగల్. | 106.34 | 135.00 | |
| స్విమింగ్ పూల్, ఏలూరు. | 59.62 | 9.87 | పనులు సాగుతున్నాయి. |
| స్విమింగ్ పూల్, మచిలీపట్నం. | 55.52 | - | |
| ఇండోర్ స్టేడియం, విజయవాడ. | 23.35 | - | భూసేకరణ సమస్య |
| ఇండోర్ స్టేడియం మరియు వరంగల్‌లో అదనపు సౌకర్యాలు | 88.39 | 128.00 | పనులు సాగుతున్నాయి. |
| మల్టీపర్పస్ స్టేడియం, రాజమండ్రి. | 100.00 | - | ప్రారంభానికి సిద్ధంగా ఉంది. |
| మినీ స్టేడియం, నర్సంపేట్. | 25.00 | 10.00 | నిధుల కొరత. |
| **మొత్తం** | **3079.89** | **1004.66** | |

(కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ నివేదిక-ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం(సివిల్)-2005)

సరే! ఇంత స్వల్ప మొత్తంలో నిధులు లేక ఇన్ని నిర్మాణాలు నిలిచిపోయిన ఇదే కాలంలో వ్యక్తిగతంగా క్రీడాకారులకు రాష్ట్ర ప్రభుత్వం ఎంతెంత పందేరం చేసిందో చూస్తే కళ్లు తిరిగిపోతాయి. పుల్లెల గోపీచంద్ ఆల్ ఇండియా బ్యాడ్మింటన్ ఛాంపియన్ షిప్ గెలిచి వచ్చాక 25 లక్షల రూపాయల నగదూ, ఐదు ఎకరాల స్థలమూ మంజూరు చేసింది. ఆయనకు టాటా ఇన్‌స్టిట్యూట్ తరపున రతన్ టాటా కూడా ఐదు లక్షలు అందజేశారు. ఇంకా కొన్ని సంస్థలు నగదు బహుమతులందజేశాయి. అలాగే సానియా మీర్జా వింబుల్డన్ జూనియర్ డబుల్స్ ఛాంపియన్ షిప్ గెలిచాక ముఖ్యమంత్రి 10 లక్షల రూపాయల నగదు, స్థలమూ మంజూరు చేశారు. తర్వాత కూడా వ్యక్తిగత స్థాయిలో అడపా దడపా ఇస్తున్న నగదు బహుమతులు చాలా భారీగా వున్నాయి. చంద్రబాబు తర్వాత వచ్చిన వై ఎస్ రాజశేఖరరెడ్డి ప్రభుత్వం అదే బాటను కొనసాగిస్తున్నది. జల యజ్ఞానికి తప్ప వేరే కార్యక్రమాలకు నిధులు లేవంటూ చివరకు సంక్షేమ రంగానికి కూడా కోతలు విధించిన రాజశేఖరరెడ్డి సర్కారు 2004-2005లో సానియా మీర్జాకు అందించిన మొత్తం 25 లక్షలు.2005-2006 సంవత్సరంలో ఆమెకు ఇచ్చిన మొత్తం 40 లక్షల రూపాయలు. వెరసి కేవలం ఈ రెండు సంవత్సరాల్లోనే 65 లక్షలు(ఆంధ్రప్రదేశ్ క్రీడామండలి నివేదిక ప్రకారం). పలువురు క్రీడాకారుల విదేశీయానానికి

2005-06లో మొత్తం 93 లక్షల 25వేలు అందిస్తే అందులో కేవలం సానియాకే 40 లక్షలు!. 2006-07లో మరో 40 లక్షల రూపాయలు ఇవ్వనున్నారు. పేరు ప్రఖ్యాతులు తెచ్చిపెట్టిన వారికి సహాయం చేయవద్దని ఎవరూ అనరు. కానీ ప్రభుత్వాలు కూడా ప్రచారమాయలో కొట్టుకుపోతే ఎలా! పైగా ఎవరైనా అంతర్జాతీయ స్థాయికి ఎదగడానికి సర్కారు సాయం అవసరమైన పరిస్థితుల్లో ఉన్నారు. అంటే అటువంటి వారికి ఇచ్చినా అర్థముంటుంది. సానియా ఇవాళ ప్రభుత్వ సాయం అందుకోవాల్సిన స్థితిలో లేదు. మొత్తం దేశంలోనే సచిన్ టెండూల్కర్ తర్వాత అత్యధిక ఆదాయం కలిగిన క్రీడాకారిణి ఆమె. ఆమె చేస్తున్న వాణిజ్య ప్రకటనల జోరు చూశాకైనా ఆమెకు మన సాయం అవసరమా?కాదా అనేది తేల్చుకోవద్దా? పైగా టెన్నిస్ పూర్తి వ్యక్తిగత ప్రాచుర్యానికి పరిమితమయ్యే పక్కా కమర్షియల్ క్రీడ. మనలాంటి దేశాల్లో అది ప్రజాస్వామిక మైన క్రీడ కూడా కాలేదు. ఎక్కువ మంది దరిచేరలేని ఖరీదైన క్రీడను ఏ రూపంలో ప్రజాస్వామ్య క్రీడ అనగలం? పైగా ప్రతిభ పరంగా సమతుల్యత పాటిస్తున్నారా అంటే అదీ లేదు. సానియా ప్రపంచంలోని టెన్నిస్ క్రీడాకారిణుల్లో తొలి 50 మందిలో ఒకరు. మరి జె జె శోభ కూడా అంతర్జాతీయంగా తొలి 50 మందిలో ఒకరని అంతర్జాతీయ అథ్లెటిక్ అసోసియేషన్ అధికారికంగా పేర్కొంది. పైగా ఏసియాడ్ మెడల్ కూడా సాధించింది. మరి ఆమెకు ఈ స్థాయిలో సాయం అందుతున్నదా! అపూర్వ, నిర్మల క్యారమ్స్‌లో తిరుగులేని క్రీడాకారిణులు. నిర్మల ఇప్పటికే 6 సార్లు జాతీయ ఛాంపియన్‌గా నిలిచింది. అపూర్వ 2005 ప్రపంచ టైటిల్ గెలుపొందింది. ఇక హంపి లాంటి చదరంగపు యువరాణులైతే సరేసరి. అసలెవరికైనా సాయం ఎంత అందివ్వాలనేది వారు ఆడుతున్న క్రీడ, అందులో వారి ప్రతిభ, ఆయా క్రీడాకారులకు-మొత్తంగా రాష్ట్ర క్రీడారంగానికి దాని అవసరం వంటి అంశాల ప్రాతిపదికగా నిర్ణయించాలి కానీ ఇలా ప్రచారార్భాటాలను బట్టి ఇచ్చుకుంటూ పోతే దాన్ని ప్రజాధనం వృధాచేయడమనే అనాల్సి ఉంటుంది. పైపెచ్చు అన్నింటా పొదుపు పాటిస్తూ నిధుల కొరత అని అలమటిస్తూ మరోవైపు ఇలా విలాసంగా దానాలు చేయడం!

అయితే ఇక్కడో చిన్న తిరకాసు ఉంది. మిగిలిన క్రీడలతో పోలిస్తే ఆంధ్రకు ఇటీవలి కాలంలో ఎక్కువ వచ్చింది సానియాతోనే. హైదరాబాదీ గర్ల్ అంటూ నేషనల్ మీడియా ముఖ్యంగా టీవీ మీడియా కొంతకాలం పాటు గుక్కతిప్పుకోకుండా ఊదరగొట్టి వదిలేసింది. కానీ ఈ ప్రచారమే ప్రభుత్వానికి గీటురాయి అవుతుందా అనేది మనం వేసుకోవాల్సిన ప్రశ్న. టీవీదేముంది?అది కూడా మార్కెట్‌లో భాగమే! అదే మీడియా ఇవాళ "సానియా-ఓవర్ రేటెడ్?" అని చర్చోపచర్చలు చేస్తున్నది. అయితే రాష్ట్ర క్రీడా చరిత్రలో ఆమెకు కచ్చితంగా ఒక చాప్టర్ కేటాయించాల్సిందే. ఎందుకంటే ఆమె కేవలం ఒక క్రీడాకారిణి మాత్రమే కాదు. ఒక ఫినామినా! 2003 వింబుల్డన్ జూనియర్స్ డబుల్స్ సాధించడంతో మీడియా దృష్టిలో పడిన సానియా అక్కడి నుంచి అప్రతిహతంగా పతాకశీర్షికల్లో ఉంటూనే వచ్చింది. బుసాన్ ఏసియా గేమ్స్(2002)లో మిక్స్‌డ్ డబుల్స్ కాంస్యం గెలవడం తర్వాత 2005 ఫిబ్రవరిలో సొంతూరులో జరిగిన డబ్ల్యుటిఏ టోర్నీ టైటిల్ గెలవడం, ఆ తర్వాత ఆస్ట్రేలియా ఓపెన్ నాలుగో రౌండ్‌కు చేరడం, ఆమె ఇప్పటి వరకూ సాధించిన విజయాలు. జాతీయ స్థాయిలో అయితే 2002 నుంచి ఆమెకు ఎదురే లేదు. హైదరాబాద్‌లో జరిగిన తొలి ఆఫ్రో ఏసియన్ గేమ్స్‌లోనయితే పొల్గొన్న ప్రతి విభాగంలోనూ ఆమె బంగారు పతకం సాధించింది. ఇవి మరీ చిన్న విజయాలు కాకపోవచ్చు. భారత్ నుంచి ఆ మాత్రం స్థాయి కలిగిన క్రీడాకారులు రాకపోయివుండవచ్చు. కానీ ఆమెకు లభించిన ప్రచారానికి ఆమె సాధించిన విజయాలకు మధ్య పొంతన అయితే లేదు. ఇంత చిన్న వయసులో ఆమెకు పద్మశ్రీ రావడం ఆనందదాయకమే అనిపించినా విశాల దృక్పథంలో చూసినప్పుడు వివాదాస్పదమే. ఎందుకంటే పలు అంతర్జాతీయ టోర్నీలో భారత పరువు నిలిపిన ఎంతో మంది క్రీడాకారులకు గుండె మండితే మనం తప్పుపట్టలేం. మెల్‌బోర్న్ కామన్వెల్త్ నుంచి పతకాలతో తిరిగి వచ్చాక భారత "ఉక్కుమహిళ" కుంజరాణి దేవి పడిన ఆవేదనను ఈ కోణం నుంచే చూడాలి. సానియాకు తాను వ్యతిరేకం కానంటూనే తనలాంటి వారు చేసిన పాపమేమిటని ఆమె ప్రశ్నించింది. కుంజరాణి దేవి చిన్న క్రీడాకారిణి ఏమీ కాదు. పలు అంతర్జాతీయ టోర్నీల్లో భారత్ పతకాల ఆశలకు పెద్ద దిక్కు. మల్లీశ్వరి లాంటి వారికి కూడా స్ఫూర్తి నిచ్చిన వెటరన్ వెయిట్ లిఫ్టర్. 38 యేళ్ల వయసులోనూ ఒలింపిక్ పతకమే ఏకైక ఆశగా పట్టుదలతో శ్రమిస్తున్న ఈశాన్య రత్నం. "సానియా మానియా"కు కారణాలు చాలా ఉన్నాయి. మన దేశంలో క్రీడలకు సంబంధించి గ్లామర్ తారలు చాలా కాలంగా ఎవరూ లేరు. ప్రత్యేకించి పశ్చిమదేశాల మార్కెట్ ఉన్న క్రీడల్లో ఒక క్రికెట్ మినహాయిస్తే మిగిలిన వాటిలో మనకు స్టార్ల కరువుంది. మల్లీశ్వరి, అంజూ జార్జి లాంటి వారి క్రీడాంశాలు గ్లామర్‌తో కూడినవీ కాదు. వారు మార్కెట్ అంచనాలకు తూగనూ లేరు. టెన్నిస్ దానికదే గ్లామర్ ఆట. విమెన్ టెన్నిస్‌కు ఎంత "గ్లామర్" ఉంటుందో టీవీ చూసేవారందరికీ ఎరికే. అటువంటి ఆటలో మార్కెట్ శ్రేణులకు అందివచ్చిన ఆణిముత్యం సానియా. ఆమె కూడా ఈ విషయాన్ని చక్కగా గ్రహించినట్టుంది. ఎందుకంటే ఆమె హావభావాలు సరిగ్గా మార్కెట్ శ్రేణులకు అతికినట్టుసరిపోతున్నాయంటే అది కేవలం అమాయకత్వంతో సాధ్యపడే పనైతే కాదు. ఇక్కడ ఆమె కృషిని, పట్టుదలను తక్కువ అంచనా వేయబోవట్లేదు. కాకపోతే ఆమెకు లభించిన ప్రచారం ఆమె క్రీడానైపుణ్యం వల్ల చేకూరింది మాత్రమే కాదు అని చెప్పడానికే ఇదంతా.

ఏమైనా శతాబ్ది మారినప్పటి నుంచి మరీ ముఖ్యంగా 2002 నుంచి క్రీడల్లో ఆంధ్రప్రదేశ్ అంటే బయటి ప్రపంచానికి సానియానే. ఒక రకంగా "సానియా యుగం" ఇది.

(ఇంకా ఉంది)

(త్వరలో సిడిఆర్‌సి ప్రచురణగా రాబోతున్న ఏపి-50 లోంచి)

# మతం - మార్క్సిస్టు దృక్పథం

బి.సైదులు

సోషలిజం - మతం అనే వ్యాసంలో రష్యా విముక్తి నేత లెనిన్ ఇలా అంటున్నారు - అంతమాత్రాన మనం నిరీశ్వర వాదులమని మన కార్యక్రమంలో ప్రకటించుకోం. ఎందుచేత? క్రైస్తవులు, ఇంకా దేవునిపై విశ్వాసం గల వారు మన పార్టీలో చేరడానికి నిషేధించబోం. మన ప్రచారంలో నాస్తికవాద ప్రచారం, తగిన శాస్త్రీయ సాహిత్య ప్రచురణ తప్పక ఉంటాయి. ఇంతవరకూ నియంతృత్వ ఫ్యూడల్ ప్రభుత్వం వీటిని కఠినంగా నిషేధించి శిక్షించింది. ఇప్పుడు ఇది మన పార్టీ పని రంగాలలో ఒకటి కావాలి. ఒకనాడు జర్మన్ సోషలిస్టులకు ఏంగెల్స్ ఇచ్చిన సలహాను బహుశా మనమిప్పుడు అనుసరించాల్సి ఉంటుంది. 18వ శతాబ్దం నాటి నాస్తికులైన ఫ్రెంచి బోధకుల సాహిత్యాన్ని విస్తృతంగా ప్రచారం చేయాలని ఆయన చెప్పారు. (చూ.ఫ్రెడరిక్ ఎంగెల్స్ ఫ్లచ్‌వింగ్స్-వితరూర్ ఓల్క్‌స్తాత్ నెం.73 సం.22-6-1874)

అయితే మత సమస్యను నైరూప్యంగా భావవాద తరహాలో వర్గపోరాటానికి సంబంధం లేని మేథోప్రశ్నగా ముందుకు తెచ్చే పొరపాటులో మనం ఎట్టి పరిస్థితిలోనూ పడరాదు. బూర్జువావర్గంలోని రాడికల్ డెమోక్రాట్లు తరచుగా అలా చేయడం కద్దు. కార్మికవర్గంపై అంతులేని దోపిడీ చేస్తూ, వారిని మందగింపచేయడంపై ఆధారపడి ఉన్న సమాజంలో మతపరమైన ద్వేషాలను కేవలం ప్రచార పద్ధతులలో నిర్మూలించగలమనుకోవడం బుద్ధితక్కువ. మానవాళిపై ఉన్న మతం సమాజంలో ఉన్న ఆర్థికపీడన యొక్క ఫలితమూ, ప్రతిబింబమూ మాత్రమేనన్న విషయం మరవటం బూర్జువా సంకుచితవాదం అవుతుంది. పెట్టుబడిదారి చీకటిశక్తులపై కార్మికవర్గం సాగించే సొంత పోరాటంలో దాన్ని విజ్ఞానవంతం చేయలేకపోతే ఎన్ని కరపత్రాలు వేసినా, ఎన్ని బోధలు చేసినా కార్మికవర్గాన్ని విజ్ఞానవంతం చేయలేవు. కార్మికవర్గం దృష్టిలో పరలోకంలో స్వర్గం గురించి ఐక్యతకంటే భూలోక స్వర్గ సృష్టికై పీడితవర్గం సాగించే నిజమైన విప్లవపోరాటంలో ఐక్యత చాలా ముఖ్యమైంది.

విశ్లేషణ

మన కార్యక్రమంలో నాస్తికవాదాన్ని పెట్టలేదు. పెట్టకూడదన్న దానికి అదే కారణం. మన పార్టీలో కలవడానికి తమ పాత ద్వేషాల అవశేషాలు ఇంకా మిగిలిన కార్మికులను మనం నిషేధించలేదు. నిషేధించరాదనడానికి అదే కారణం. మనెప్పుడూ శాస్త్రీయ ప్రపంచ దృక్పథాన్ని ప్రచారం చేయాలి. అనేకరకాల క్రైస్తవుల అవకతవక వైఖరులపై మనం పోరాడటం అత్యవసరం. అంతమాత్రాన మత సమస్యకు దానికి ఎంతమాత్రమూ తగని ప్రథమస్థానం ఇవ్వాలని అర్థం కానే కాదు (లెనిన్).

ఈ అభిప్రాయాలే అన్ని కమ్యూనిస్టుపార్టీల అభిప్రాయాలుగా ఉన్నాయి. అంటే కమ్యూనిస్టుపార్టీలకు నాస్తికవాదుల వాదన సరైనదేననే అభిప్రాయం అంతర్గతంగా ఉన్నది. కాని దాని ఫలితం ప్రజలలో విరుద్ధంగా ఉంది అనే అనుభవాన్ని కూడా చూశారు. అందువలన పై విధమైన అభిప్రాయాలను వెలిబుచ్చడం జరిగింది. అదే సమయంలో శాస్త్రీయ దృక్పథాన్ని ప్రచారం చేయడం అన్నా, విజ్ఞానవంతం చేయడం అన్నా, మార్క్సిస్టు తత్వశాస్త్రాన్ని, భౌతికవాదాన్ని బోధించడం అన్నా మత సమస్యను కార్యక్రమంలో పెట్టడమే అవుతుంది. కమ్యూనిస్టు అభిప్రాయాలకన్నా ముందే నాస్తికవాదం సమాజంలో ఉన్నది.

లోకాయత గ్రంథాలు ఒకప్పుడున్న ఇప్పుడు లేవు కదా. లోకాయత భావాలపై అనేకచోట్ల వ్యక్తమైన శతృత్వం వల్ల లోకాయత గ్రంథాలను కావాలని ధ్వంసం చేసినట్లు ఊహించారు. ఏదేమైనా చాలాకాలం కిందట బహుశా క్రీస్తుశకానికి ముందే అలాంటి విధ్వంసం జరిగి ఉంటుంది. పోయిన గ్రంథాలు పోగా మనకు మిగిలింది లోకాయత భావాలను గురించిన చెదురుమదురు ఉల్లేఖనలు. అవి కూడా లోకాయతను చులకన చేయడానికి తిరస్కరించడానికి ఉపయోగించుకున్న సందర్భాలే. వ్యతిరేకులు రాసిన వ్రాతల్లో నుంచే లోకాయతను తెలుసుకోవడం దాని దురదృష్టం. (బెల్వాల్కర్, రావడే) లోకాయత ఏ భావాలనుప్రచారం చేయదల్చుకుందో రాగరహితంగా ఉదహరించే ఆసక్తి దాని వ్యతిరేకులకు ఉండదు. అందుచేత అలాంటి ఆధారాల్లో నిష్పక్షపాత ధోరణిని ఆశించకూడదు. (లోకాయత - దేవీప్రసాద్ చటోపాధ్యాయ పే.6)

ఇక్కడ లోకాయత అంటే నాస్తికవాదం, హేతువాదం, భౌతికవాదం, పదార్థవాదాలకు సంబంధించినదనే అభిప్రాయం.

లెనిన్, ఏంగెల్స్ ఉదహరించినది నాస్తికులైన ఫ్రెంచి బోధకుల గురించి. దేవీప్రసాద్ ఉదహరించినది ఇండియన్ నాస్తికవాదుల గురించి. నాస్తికవాద వ్యతిరేకుల పుస్తకాల ఆధారంగా ఇప్పటి నాస్తికవాద సంఘాలు పడుతూ లేస్తూ వస్తుండవచ్చు. నాస్తికులు అంటే దేవుడు లేడు అనేవారు అని వారి వ్యతిరేకులైన మతవాదులే ప్రచారం చేసి ఉండవచ్చు. ఇప్పటి నాస్తికసంఘాలవారు కూడా ఆ వాదనకే కట్టుబడి ఉండవచ్చు. అలాగే ప్రచారం చేస్తూ వచ్చారు కూడా. నక్సలైట్లు, నక్సలైట్లు అంటుంటే మేం నక్సలైట్లమేనని ప్రకటించుకొన్నట్లు, నాస్తికులంటే దేవుడు లేడనేవారని ప్రత్యర్థులంటూ ఉంటే అవును మేము దేవుడు లేడంటాం అని ప్రకటించుకొని ఉండవచ్చు. అలా అనడం

అలవాటుగా మారి ఉండవచ్చు. ఇందులో చాణక్యతంత్రం కూడా ఉండవచ్చు. అయితే తంత్ర సాఫల్యంలో నాస్తికుల బలహీనత కూడా తోడవుతున్నది. మన అనుభవంలో చూస్తే ఆ ప్రచారం వలన నాస్తికులు బలహీనపడుతూ వచ్చారే తప్ప బలపడలేదు. బలహీనపడుతున్నామనే ఆలోచనతో అందులోని వారే కొందరు హేతువాద సంఘం అని పేరు పెట్టుకోవడం జరిగింది. పేరు మారిందే తప్ప ప్రచారంలో తేడా రాలేదు. మతవాదులు అవును అంటే కాదు అని, ఉన్నది అంటే లేదని వాదించే విధంగా ఈనాటి నాస్తికవాదులు అలవాటుపడినారు.

కమ్యూనిస్టులు కూడా నాస్తికవాదులకు ఎదురయ్యే ప్రతికూల పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని ఆ వైపుగా తమ పరిశోధనలను నిలిపివేశారు. మార్క్సిస్టు తత్వశాస్త్రాన్ని కమ్యూనిస్టుల బైబిలుగా, ఖురాన్‌గా మార్చలేకపోవడం ఒక లోపంగా మారినది. పదార్థాన్ని తాత్వికపునాదిగా గుర్తించి హెగెల్ భావవాద గతితార్కిక సూత్రాలను పదార్థానికి అన్వయించి భౌతికవాద గతితార్కిక సూత్రాలుగా మార్చినా, మతాన్ని కార్యక్రమంలో ప్రకటించకుండా ఉన్నారు. మతానికి వ్యతిరేకంగా తమ తాత్విక పునాదిని గురించి జనరంజకంగా ఎలా చెప్పాలి? అనే విషయం గురించి కమ్యూనిస్టులు ఆలోచించలేదు. దేవుడికి ప్రత్యామ్నాయం పదార్థమని, మతానికి ప్రత్యామ్నాయం మార్క్సిస్టు తత్వశాస్త్రమని చెప్పలేదు. ఆ కోణంలో ప్రజల భావజాలాన్ని మార్చడం జరుగలేదు. పదార్థం అంటే ఏమిటో ప్రజలకు అర్థం చేయించలేదు.

నిరీశ్వరవాదులమని ప్రకటించడమే నాస్తికవాదం కాదు. నాస్తికుల కార్యక్రమం దేవుడు లేడు అని చెప్పడం కాదు. దేవుడికి ప్రత్యామ్నాయం పదార్థమని చెప్పడమే కార్యక్రమం. దేవుడు ఉన్నాడా? లేడా? అనే ప్రశ్నకు జవాబు చెప్పడానికి బదులు, ప్రశ్నించే విధానాన్ని, ప్రశ్నను మతవాదులకు, బూర్జువాలకు ప్రత్యేకంగా మేలుచేసే విధంగా ఉండడాన్ని మార్చే ప్రయత్నానికి పూనుకోవాలి. నాస్తికుల అనుభవాలనుండి కమ్యూనిస్టులు గుణపాఠం తీసుకోవలసి ఉండెను. అంటే నిరీశ్వరవాదులమని, దేవుడు లేడని చెప్పడం ద్వారా ప్రజలనుండి వ్యతిరేకత వస్తున్నది కావున వ్యతిరేకత రాకుండా ఉండాలంటే ఎలా చెప్పాలి? అని ఆలోచించి తగిన విధానాన్ని ఎన్నుకోవడమే ఆ గుణపాఠం. ప్రజలనుండి వ్యతిరేకత రాకుండా ఉండేంతవరకు ఆ ప్రయోగాలు సాగుతూనే ఉండాలి. ఆ పట్టుదలతో సాగినపుడు ఏదో క్రమంలో అది సాధ్యమవుతుంది. కాని ఆ దిశగా కమ్యూనిస్టుల ప్రయాణం సాగలేదు. మార్క్స్, ఏంగెల్స్, లెనిన్‌లు మతాన్ని కార్యక్రమంలో భాగం చేయకపోవడం వలన సకాలంలో సామాజిక సమస్యలను గుర్తించలేకపోతున్నారు. ఆయా కారణాల వలన మార్క్సిజం వర్గకుదింపువాదం అనే విమర్శను ఎదుర్కొంటున్నది.

నిరీశ్వరవాదులమని కార్యక్రమంలో ప్రకటించబోం అంటూనే నాస్తికవాదాన్ని ప్రచారం చేయాలి అంటున్నారు. ఇది వైరుధ్యపూరిత విధానం. మత సమస్య పట్ల స్పష్టత ఏర్పడని పరిస్థితి. అంటే నిరీశ్వరవాదులమని కమ్యూనిస్టులు తమ కార్యక్రమంలోనే ప్రకటించుకోవాలి అని కాదు. నిరీశ్వరవాదులు అనబడుతున్న వారికి మతవాదులు ఆపాదించిన అర్థాన్ని తొలగించాల్సిన బాధ్యత కమ్యూనిస్టులు తీసుకోవాలి. మత సమస్య విడి సమస్య కాదు. అది కూడా వర్గపోరాటంలో భాగమే. రెండు విరుద్ధ అభిప్రాయాల మధ్య జరిగే చర్చ కూడా వర్గపోరాటంలో భాగమే. మత సమస్య ఆర్థిక పీడన యొక్క ఫలితం, ప్రతిబింబం కాదు. మత సమస్య, ఆర్థిక పీడనం సాపేక్షంగా వచ్చినవే. మతసమస్య భావజాల సంబంధమైనది. అంతమాత్రాన మతసమస్యకు ఎంతమాత్రం తగని ప్రథమస్థానం ఇవ్వాలని అర్థం కానేకాదు అని లెనిన్ అనడం ద్వారా భావజాలాన్ని అప్రధానం చేయడం జరిగింది. అలా అప్రధానం చేయడం వలన అది ప్రతిబంధకమై కూర్చున్నది.

అంబేద్కర్ కూడా మతాన్ని సమర్థించాడు. హిందూ మతాన్ని మాత్రం వ్యతిరేకించాడు. బలాన్ని ఉపసంహరించిన తరువాత కమ్యూనిస్టురాజ్యాన్ని కాపాడగలిగేది మతమొక్కటే అంటాడు. అలా అంబేద్కర్ కూడా భావజాలరంగాన్ని అప్రధానం చేయడం జరిగింది. అంబేద్కర్ బ్రాహ్మణిజం పై చేసిన దాడి మొత్తంగా మతంపై చేయాల్సి ఉండెను.

మతాన్ని వ్యతిరేకించే నాస్తికవాదుల ప్రక్రియ సరిగా లేనందువల్లనూ, వివిధ అస్థిత్వ ఉద్యమాల మధ్య ఉండవలసిన అంతస్సంబంధాలను గుర్తించకపోవడం వల్లనూ, ప్రజలు నాస్తికవాదానికి దూరంగా ఉన్నారు. సక్రమ ప్రక్రియను ఎన్నుకోగలిగితే, దేవుడిపై నమ్మకం గలవారిని తటస్థపరచడం సాధ్యమే. మతం, మతాన్ని సమర్థించే రాజ్యం, సామ్రాజ్యవాదమనే దుష్టత్రయం మనుషుల పుట్టుకకు మూలం దేవుడనే చెప్తారు. నాస్తికులం, కమ్యూనిస్టులమైన మేం మనుషుల పుట్టుకకు మూలం పదార్థమని చెప్తాం. పదార్థం అంటే మట్టి, గాలి, నీరు అని చెప్పడం వలన ప్రజలు నాస్తికులకు కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా మారరు. మతానికి బాగా అలవాటుపడిన ప్రజలు మౌనంగా మరుతారు. మిగతావారు ఆలోచిస్తారు.

నాస్తికులు కాకుండా కమ్యూనిస్టులు కాలేరు అనే నినాదం ఇచ్చారు నాస్తికవాదులు. ఇది సరైన నినాదమే. అలాగే కమ్యూనిస్టులు కాకుండా నాస్తికులు కాలేరు అనేది కూడా వాస్తవం. అలాగే ఏకకాలంలో కమ్యూనిస్టులు, నాస్తికవాదులు (భౌతికవాదులు), స్త్రీవాదులు, దళితవాదులు కాకుండా ఏ వాదులు కాలేరు. మతమనే పరిగకంపను తొలగించడానికి ప్రయత్నించడమే సాంస్కృతిక విప్లవం. మతాన్ని వ్యతిరేకించడమంటే బిజెపినో, ఆర్ఎస్ఎస్‌నో తిట్టడం కాదు. మతం మంచిది కాదనో, చెడ్డదనో అనడం కాదు. ఒక్కొక్క విషయంలో మతం ఏమి చెప్తుందో తెలుసుకొని, దానికి ప్రత్యామ్నాయం ఏమిటో చెప్పడం ద్వారా మాత్రమే మతాన్ని వ్యతిరేకించినట్లు అవుతుంది. ఒకరి అభిప్రాయానికి భిన్నంగా, లేదా ఒకరి ప్రయోజనానికి భిన్నంగా మరొకరు వ్యవహరించడం వల్లనే ఇరువురి మధ్య ఘర్షణ ఏర్పడుతుంది. ఆ భిన్న అభిప్రాయాలేమిటో భిన్న ప్రయోజనాలేమిటో ఒకేచోట చర్చించినప్పుడు మాత్రమే

న్యాయమైనది తెలుస్తుంది. మతం - భౌతికవాదం విషయంలోనూ అంతే. తాత్వికపునాది, సృష్టి, ఆత్మ, స్వర్గం, నరకం, మనసు, మానవ స్వభావం, పూర్వజన్మ పునర్జన్మ, మంచివారు, చెడ్డవారు, జనాభా, పేదరికం, స్త్రీ సమస్య, కులసమస్య లాంటి ఎన్నో విషయాలు లేదా అంశాల (ఫినామినా) పట్ల మతతత్వ శాస్త్రం, మార్క్సిస్టు తత్వశాస్త్రం ఎలాంటి భిన్నాభిప్రాయాలు కలిగి ఉన్నాయో స్పష్టం చేస్తూ విభజనరేఖ గీస్తూ కార్యక్రమంలో ప్రచారంలో భాగం చేయాలి. పెండ్లిళ్లు, చావులు, పండుగల విషయంలోను తమదైన ప్రత్యామ్నాయాన్ని చూపాలి.

మతాన్ని కార్యక్రమంలో భాగం చేయకుండా ఆర్థిక సమస్యను కూడా సక్రమంగా వివరించలేరు. నీవు పేదరికంలో ఉండడానికి, పూర్వజన్మ సుకృతం, తలరాత, అదృష్టం, దురదృష్టం, గత జన్మ పాపం అని మతం నమ్మించగలిగినపుడు, వాటికి కమ్యూనిస్టులు ప్రత్యామ్నాయం చెప్పకపోతే ఆ విషయాలలో సక్రమ వివరణ జరగనట్లే. కమ్యూనిస్టులు ఈ పార్శ్వం గురించి ఏమీ చెప్పకుండా మీ శ్రమనుదోపిడీ చేస్తున్నారు అని చెప్పడం పాక్షిక జ్ఞానాన్ని ఇవ్వడమే అవుతుంది.

కులం దేవుడు సృష్టించాడని, తాము రాజుల వారసులమని అనుకున్నప్పుడు కుల నిర్మూలన కొరకు ప్రజలు ఎందుకు ప్రయత్నిస్తారు? ప్రజలారా! బ్రాహ్మణులు చెప్పినట్లు కులాలు పుట్టింది అలా కాదు, అంబేద్కర్ చెప్పినట్లు ఇలా పుట్టాయి అని చెప్పకపోవడమంటే ఆ విషయంలో మతాన్ని కార్యక్రమంలో భాగం చేయకుండా ఉండడమే అవుతుంది. సమస్య విశ్లేషణకు గతితార్కిక భౌతికవాద సూత్రాలను అన్వయించకపోవడమే అవుతుంది. అలాంటప్పుడు గతితార్కిక సూత్రాలను రూపొందించుకొని ప్రయోజనమేమిటి? నాస్తికులు, కమ్యూనిస్టులు తమ తాత్విక పునాది పదార్థమని, పదార్థమంటే మట్టి, గాలి, నీరు అని చెప్పగలిగితే మతాన్ని కార్యక్రమంలో భాగం చేసినట్లు అవుతుంది.

కమ్యూనిస్టులు తమ కార్యకర్తలకు మాత్రమే పరిమితం చేసుకున్న విషయాలు తప్ప కమ్యూనిస్టు నాయకులు రాసి ప్రజలకు విడుదల చేసిన ప్రతివిషయం కార్యక్రమంలో భాగమే అవుతుంది. మార్క్స్ మతం మత్తుమందు అన్నారు. లెనిన్ కూడా మతాన్ని వ్యతిరేకించారు. అలా అంటూనే మా కార్యక్రమంలో భాగం కాదంటున్నారు. ఇది వైరుధ్యపూరితం.

బలప్రయోగం, సమ్మతి - ఈ రెండింటి ద్వారానే ఏ పాలకవర్గమైనా తన ఆధిపత్యాన్ని నిలుపుకోగలదంటాడు గ్రాంసీ. గ్రాంసీ చెప్పిన విషయాల నుండి మనం నేర్చుకోవలసింది ఎంతో కొంత ఉందంటున్నారు కమ్యూనిస్టులు. బలప్రయోగం అంటే మిలిటరీ, పోలీసుశాఖల ద్వారా నియంతృత్వం. సమ్మతి అంటే తమ ప్రాపంచిక దృక్పథం ద్వారా ప్రజలను పరాయీకరించడం ద్వారా తమకు అనుకూలంగా మార్చుకోవడమే. బూర్జువా వర్గాల ప్రాపంచిక దృక్పథం మతం. ఈ సమ్మతిని చర్చి (గుడి), విద్యాసంస్థలు (బడి), కుటుంబం వగైరాల ద్వారా సాధిస్తాయన్నాడు. గుడి ద్వారా, కుటుంబం ద్వారా మత భావజాలాన్ని బోధించడం జరుగుతుంది. బడి ద్వారా కూడా మతం మతానికి అనుకూలంగా మార్చబడే విజ్ఞానశాస్త్రమే బోధించడం జరుగుతుంది. ఉపాధ్యాయులకు బోధించే తత్వశాస్త్రం కూడా భౌతికవాదానికి ఉపయోగపడని తత్వశాస్త్రమే. మతభావజాలం, దోపిడీ భావజాలం, ఆధిపత్య భావజాలం, పురుషాధిపత్య భావజాలం, బ్రాహ్మణ భావజాలం అనేవి ఒకదానికొకటి (కొద్ది తేడాలతో) రూపాంతరాలే తప్ప పూర్తిగా వేరు వేరు కావు. బంగారంతో చేసిన పుస్తెలతాడును చూపిస్తూ ఇది బంగారమా, పుస్తెలతాడా అని ప్రశ్నిస్తే ఏం చెప్తాం? అది ఏక కాలంలో బంగారం అవుతుంది, పుస్తెలతాడు కూడా అవుతుంది. ఇలా విడదీయరాని విషయాలను ఎన్నో చూస్తాం. సమ్మతిని సాధించేది భావజాలం అంటే ఇక్కడ మతవాద భావజాలం లేదా మతవాద ప్రాపంచిక దృక్పథం అంటాం. మావో ముందుకు తెచ్చిన సాంస్కృతిక విప్లవం కూడా మతవాద భావజాలంపై జరుపవలసిందే. మావో ఆకాంక్ష మార్క్సిజానికి అదనపు జోడింపా? లేదా ఉన్న విషయాన్ని సవరించడమా? అది మత సమస్యను కార్యక్రమంలో పెట్టాలనే సవరింపు ఆవశ్యకతను, ఆకాంక్షను ముందుకు తేవడమే. అలాగే అంబేద్కర్ తెచ్చిన కులసమస్య మార్క్సిజానికి జోడింపు అవుతుంది. కమ్యూనిస్టులు హిందూ మతతత్వం మా ప్రధానశత్రువు అని హిందూ ఫాసిజం నశించాలి అంటున్నప్పుడు కార్యక్రమంలో మతం ఉన్నట్లు కాదా? మతం కార్యక్రమంలో భాగం కాదు అనడంలో భాగంగా మతం-మతతత్వం అని రెండుగా విడగొట్టి పాము చుట్టం, పడగ శత్రవు అన్నట్లు మతతత్వం శత్రువు అంటున్నారు. అంటే కోడిగుడ్డు దొంగతనం చేసినరోజున ప్రోత్సహించి పట్టుబడ్డరోజు చెవి కొరికించుకోవడం అవుతున్నది. వాస్తవానికి ప్రతి ఘర్షణలో ఉండే రెండు ధృవాలలో ఒకటి మతతత్వం, మరొకటి మార్క్సిస్టు తత్వం అవుతుంది. రెండు కమ్యూనిస్టుపార్టీల మధ్య ఘర్షణలో కూడా అంశాన్ని బట్టి ఒకటి మతతత్వం, మరొకటి మార్క్సిస్టు తత్వం అయి ఉంటుంది. ఒకే కమ్యూనిస్టుపార్టీలో జరిగే టూలైన్ స్ట్రగుల్‌లో కూడా ఒకటి మతతత్వం, మరొకటి మార్క్సిస్టుతత్వం అయి ఉంటుంది. మతతత్వం అంటే సమాజంలోని 90 శాతం ప్రజలకు విరుద్ధమైన అభిప్రాయాన్ని బలపరచడం, ముందుకు తేవడం కూడా అవుతుంది. మన వెన్ను మనకు కనపడదు అన్నట్లు మన వాదన మతతత్వానికి సంబంధించినది అయినా మార్క్సిస్టు తత్వంగా భ్రమపడడం ఉంటుంది. అలాంటప్పుడు ఆ విషయంపై చర్చ సాగాలి. ఆ చర్చలో మన ఆలోచన మెరుగుపడవచ్చును. ఆలోచన స్తంభించినట్లయితే తనది తప్పే అయినా ఒప్పు అనవచ్చును. తను చేసే విమర్శ విధ్వంసకమైనా, నిర్మాణాత్మకమైనదని వాదించవచ్చును. అలాంటి సమయంలో ఆ చర్చ ద్వారా చైతన్యవంతమయ్యే వారి సంఖ్య పెరుగుతుంది. ఒక గుణాత్మకమార్పుకు దారితీస్తుంది. తగు సవరణలు చేసి మతాన్ని విప్లవానికి ముందే కార్యక్రమంలో భాగం చేయడం వలన సమస్యలకు భావజాల పరిష్కారం లభించి సాంస్కృతిక విప్లవం విజయవంతమవుతుంది.

# సంచలనాల శతాబ్దంతో ముడివేసుకున్న గాల్‌బ్రెత్

డి.పాపారావు

వ్యక్తిత్వం

**"ఆర్థికశాస్త్రంలో మెజారిటీ ఆలోచన ఎల్లవేళలా పొరపాటే అవుతుంది" - జాన్ కెన్నెత్ గాల్‌బ్రెత్**

జాన్ కెన్నెత్ గాల్‌బ్రెత్ మన కాలపు గొప్ప ఆర్థికవేత్త. ఏప్రిల్ 29, 2006న ఆయన తన 97వ ఏట మరణించాడు. ఉదారవాద భావజాలం కలవాడిగా ప్రఖ్యాతి గాంచిన ఆయన 1908, అక్టోబరు 15న కెనడాలోని ఒంటారియోలో జన్మించాడు. 1931లో టొరాంటో విశ్వవిద్యాలయంలో తన ఉన్నతవిద్య పట్టాను పొందాడు. అనంతరం అమెరికాకు వెళ్లి అక్కడ కాలిఫోర్నియా విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేట్ పట్టాను పుచ్చుకున్నాడు.

ఆయన తండ్రి వ్యవసాయదారుడిగాను, ఉపాధ్యాయుడిగాను వృత్తులను నెరిపాడు. తల్లి రాజకీయ కార్యకర్త. విద్యాభ్యాసం ముగిసిన తరువాత 1934లో గాల్‌బ్రెత్ హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో ట్యూటర్‌గా చేరాడు. 1937లో అమెరికా పౌరసత్వం స్వీకరించాడు. అదే సంవత్సరంలో ఇంగ్లాండ్‌లోని కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో సంవత్సరం పాటు ఫెలోషిప్ స్వీకరించాడు. అక్కడే ఆయనపై ప్రఖ్యాత ఆర్థికవేత్త జాన్‌మేనాడ్ కీన్స్ ప్రభావం పడింది. 1934-39 సంవత్సరాల మధ్యకాలంలో మొత్తంమీద ఆయన జీవితం హార్వర్డ్ విశ్వవిద్యాలంలో అధ్యాపకునిగా నడిచింది. 1939-40 సంవత్సరాల మధ్య ఆయన ప్రిన్స్టన్ విశ్వవిద్యాలయంలో అధ్యాపకునిగా పనిచేశాడు. 1943-48 మధ్య ఫార్ట్యూన్ పత్రిక సంపాదకునిగా పనిచేశాడు. 1949లో హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో ఆర్థికశాస్త్ర అధ్యాపకునిగా నియమితుడయ్యాడు.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో గాల్‌బ్రెత్ అమెరికా ప్రభుత్వపు ధరల నియంత్రణ కర్తవ్యాన్ని నిర్వహించాడు. ఈ కాలంలో ఆయన పని ద్రవ్యోల్బణం ప్రభావం యుద్ధ కృషిపై పడకుండా చూడటమే. యుద్ధానంతర కాలంలో అమెరికా, దాని మిత్రదేశాలు వ్యూహాత్మకంగా జరిపిన బాంబుదాడులపై సర్వేను నిర్వహించే కర్తవ్యం ఆయనకు అప్పగించబడింది. ఈ వ్యూహాత్మక బాంబుదాడుల మూల్యం, వాటి ప్రయోజనాలకంటే ఎక్కువగా ఉందనీ, ఈ దాడులేమీ యుద్ధకాలాన్ని కుదించలేకపోయాయని ఆయన తన నివేదికలో పేర్కొన్నాడు. అలాగే యుద్ధానంతర కాలంలో జర్మనీ, జపాన్ దేశాల పరిపాలనా యంత్రాంగాలకు కూడా ఆయన సలహాదారుగా వ్యవహరించాడు.

1960వ దశకంలో అమెరికా అధ్యక్షునిగా ఎన్నికైన జాన్ ఎఫ్.కెనడీకి గాల్‌బ్రెత్ సన్నిహిత మిత్రుడు. గాల్‌బ్రెత్‌ను కెనడీ భారతదేశంలో అమెరికా రాయబారిగా నియమించాడు. ఆయన ఈ పదవిలో 1961-63 మధ్యకాలంలో ఉన్నాడు. భారతదేశంలో రాయబారిగా ఉండగా ఆయన పండిట్ జవహర్‌లాల్ నెహ్రూకు సన్నిహితుడయ్యాడు. ఆర్థిక వ్యవహారాలలో భారతదేశ ప్రభుత్వానికి పలు సలహాలను ఇచ్చాడు. 1947లో తన చూసీ చూడని ధోరణిలో భారత విభజనకు కారణమైన లూయిస్ మౌంట్‌బాటన్‌ను ఆయన తీవ్రంగా విమర్శించాడు. భారతదేశంలో ఉండగా కాన్పూర్‌లోని ఐఐటిలో మొట్టమొదటి కంప్యూటర్ సైన్స్ విభాగం ఏర్పాటుకు సహాయపడ్డాడు. పదవీ విరమణ తర్వాత కూడా భారతదేశానికి సన్నిహిత మిత్రుడిగా ఉన్నాడు.

1937, సెప్టెంబర్ 17వ తేదీన గాల్‌బ్రెత్ వివాహం క్యాథరైన్ అట్వాటర్‌తో జరిగింది. వారికి నలుగురు కుమారులు ఉన్నారు. అమెరికా ఆర్థికవేత్తల సంఘం అధ్యక్షునిగా పనిచేసినప్పటికీ ఆయన ఆర్థికశాస్త్రంలో గణిత నమూనాలపై ఆధారపడటాన్ని

---

సోవియట్ రష్యా, చైనాలలో సోషలిస్టు రాజ్యాలు ఎందుకు పతనమయ్యాయి? అంటే సాంస్కృతిక విప్లవం సక్రమంగా జరుపకపోవడం వల్ల అంటారు. సాంస్కృతిక విప్లవం జరగడం అంటే? భావజాలాన్ని మార్చడం అంటారు. ఏ భావజాలాన్ని మార్చాలి? బూర్జువా భావజాలాన్ని. బూర్జువా భావజాలం, మత భావజాలం వేరు వేరా? కాదు. కావున మతాన్ని కార్యక్రమంలో భాగం చేద్దామా? అంటే వద్దు అంటారు. ఎందుకు? అంటే దేవునిపై విశ్వాసంగల వారిని మన పార్టీలోకి నిషేధించినట్లు అవుతుంది అంటారు. అయితే ఎలా పరిష్కరించబడాలి?

కమ్యూనిస్టు ఉద్యమాలు బలహీనపడడానికి, అస్థిత్వ ఉద్యమాలు ఉద్భవించడానికి, అస్థిత్వ ఉద్యమాలు బలహీనపడడానికి మతాన్ని కార్యక్రమంలో భాగంగా ప్రకటించకపోవడమే. సమాజంలో ఏ తాత్విక పునాది నిలదొక్కుకుంటుందో దానికి సాపేక్షంగా అనుబంధ రాజకీయాలే నిలదొక్కుకుంటాయి.

కావున కమ్యూనిస్టులు, అస్తిత్వ సంఘాలు తమకు కావలసిన తాత్విక పునాది ఏర్పరచుకోవాలి. లేదా అనివార్యంగా విభజనలు, స్తబ్దతలు, నిరాశలు, నిస్పృహలు తప్పవు. ❑

తిరస్కరించాడు. తన జీవితకాలంలో సుమారు 30కి పైగా పుస్తకాలు రాసాడు. వందలాది వ్యాసాలు, పలు నవలలు కూడా రచించాడు. 1952లో రచించిన తన పుస్తకం అమెరికన్ క్యాపిటలిజం 'ది కాన్సెప్ట్ ఆఫ్ కౌంటర్ వెయిటింగ్ పవర్'లో ఆయన భవిష్యత్తులో అమెరికా ఆర్థిక వ్యవస్థ ప్రధానంగా మూడు పునాదులపై ఆధారపడి ఉంటుందని పేర్కొన్నాడు. ఆ పునాదులే బడా వ్యాపారం, సంఘటిత పక్ష పెద్ద కార్మికవర్గం, క్రియాశీల ప్రభుత్వం - అంటే 1930వ దశకపు ఆర్థికమాంద్యపు ముందరికాలంలా కాక బడా వ్యాపారానికి ఆర్థికవ్యవస్థలో పూర్తి స్వేచ్ఛ ఉండదనేది ఆయన ఉద్దేశ్యం. అయితే ఆయన జీవించి ఉండగానే 1970వ దశకం మధ్యభాగం అనంతరం ఆయన వేసిన ఈ అంచనా తప్పయ్యింది. బడా బహుళజాతి సంస్థలు ప్రపంచ ఆర్థిక వ్యవస్థపై విశృంఖల నాట్యం చేసే కాలానికి తెరలేచింది. కార్మికవర్గం, పెట్టుబడిదారుల దాడిని కాచుకునే ఆత్మరక్షణ స్థితిలోకి పడిపోయింది. (నేడు పరిస్థితి మరలా మారుతున్నప్పటికీ) ప్రభుత్వం ఆర్థిక, సామాజిక వ్యవహారాలలో క్రియాశీల పాత్ర నుంచి తప్పుకుంది. స్థూలంగా గాల్‌బ్రెత్ ఊహించిన విధంగా కాక 1930వ దశకపు ఆర్థిక సంక్షోభం నుంచి పెట్టుబడిదారీ ప్రపంచాన్ని గట్టెక్కించిన కీన్స్ విధానాలు 1970వ దశకం మధ్యనాటికల్లా దివాలా తీయసాగాయి. తన రచనలు అన్నింటిలోకీ ప్రఖ్యాతి గాంచిన 'ద అఫ్లుయంట్ సొసైటీ' అనే పుస్తకాన్ని గాల్‌బ్రెత్ 1958లో రచించాడు. ఆయన ఈ పుస్తకంలో ఆర్థికరంగానికి సంబంధించిన తన అభిప్రాయాలను వివరించాడు. రెండవ ప్రపంచయుద్ధానంతర కాలంలో అప్రతిహతంగా ముందుకు సాగేందుకై, అమెరికా పన్నుల రూపంలో వసూలు చేసిన నిధులను హైవేల నిర్మాణం, విద్యారంగం వంటి వాటిపై భారీగా వెచ్చించాలని ఆయన సూచించాడు. అలాగే, ఈ పుస్తకంలో ఆయన వినియోగదారుల సంస్కృతిని దుయ్యబట్టాడు. ఆర్థిక, సామాజిక ఆరోగ్యానికి ఎడతెరిపిలేకుండా సరకుల ఉత్పత్తి మాత్రమే మార్గమనే భావనను తీవ్రంగా విమర్శించాడు. ఈ పుస్తకం ప్రభావం అమెరికా అధ్యక్షులైన జాన్ ఎఫ్.కెనడీ, జాన్సన్‌ల పరిపాలనా యంత్రాంగాలపై బాగా ఉంది. గత శతాబ్దంలో రచించబడిన వంద అత్యుత్తమ ఆంగ్ల పుస్తకాల జాబితాలో ఈ పుస్తకం 46వ స్థానాన్ని ఆక్రమించింది.

1967లో రచించిన 'ది న్యూ ఇండస్ట్రియల్ స్టేట్' పుస్తకంలో గాల్‌బ్రెత్ అమెరికా పారిశ్రామికరంగంలో అతికొద్ది భాగం మాత్రమే పూర్తి స్వేచ్ఛాయుత పోటీలో పనిచేస్తుందని పేర్కొన్నాడు. ఇక అనంతరం 1973లో రచించిన మరొక పుస్తకంలో ఈ భావనలను మరింత విస్తృతంగా వివరించాడు.

1990లో రచించిన ఆర్థికమాంద్యాలకు సంబంధించిన పుస్తకంలో ప్రస్తుత అభివృద్ధి బలుపు కాదని బహుశా అది కేవలం వాపు మాత్రమేనని ఆయన వివరించాడు. ఆర్థిక సంక్షోభాలు అన్నింటికీ ముందర ఉండే సారూప్యత స్పెక్యులేషన్ (సట్టా వ్యాపారం) కోసమై తేలికగా అందుబాటులో ఉండే రుణాలేనని ఆయన తేల్చిచెప్పాడు. సాంప్రదాయక ఆర్థిక సిద్ధాంతం ప్రస్తుత కాలానికి పనికి వచ్చేది కాదని ఆయన అభిప్రాయం. ఈ సిద్ధాంతం కొరతలు, పేదరికం అధికంగా ఉన్న కాలానికి మాత్రమే పనికివచ్చేదని, నేటి సుసంపన్న కాలానికి కాదని ఆయన పేర్కొన్నాడు. అంటే, నేటి కాలానికి పూర్తిగా నూతన ఆర్థికసిద్ధాంతం అవసరమనేది గాల్‌బ్రెత్ అభిప్రాయం. ప్రైవేటు వ్యాపారం తన ప్రకటనల ద్వారా కృత్రిమంగా వినియోగదారులలో అవసరాలను సృష్టిస్తుందని ఆయన పేర్కొన్నాడు. దీనివలన కృత్రిమమైన సుసంపన్నత ఏర్పడుతుందని, ప్రభుత్వరంగం నిర్లక్ష్యం చేయబడు తుందని వివరించాడు. వినియోగదారుల సంస్కృతిని అదుపు చేయడంలో ప్రభుత్వం తనవంతు పాత్రను పోషించాలని కోరాడు. విద్యారంగంలో కృషిద్వారా నూతన తరహా పౌరులను సృష్టించాలనీ, ఆ పౌరుల వర్గానికి అమెరికా పరిపాలనా బాధ్యత లను అప్పగించాలనే గాల్‌బ్రెత్ సూత్రీకరణ మనకు ప్లేటో తన 'రిపబ్లిక్' పుస్తకంలో రాసిన ఆదర్శవాద సమాజాన్ని సూచించక మానదు.

1930వ దశకపు ఆర్థిక సంక్షోభకాలం నుంచీ రెండవప్రపంచయుద్ధం అనంతరకాలం వరకూ అమెరికా ప్రజలకు ఆయన అందించిన సేవలకు గాను - 1946లో గాల్‌బ్రెత్‌కు అమెరికా ప్రభుత్వం 'మెడల్ ఆఫ్ ఫ్రీడమ్' గుర్తింపును ఇచ్చి సత్కరించింది. ఆయన రచించిన 'ది అఫ్లుయెంట్ సొసైటీ' పుస్తకానికిగాను ఆయనకు 'టామిమెంట్ బుక్ అవార్డ్', 'సిడ్నీహిల్‌మన్ అవార్డ్'లు లభించాయి. గాల్‌బ్రెత్ భారతీయకళ, ఆధునిక నగర ప్రణాళిక, డిజైను, పౌరహక్కులు, అమెరికా విదేశాంగ విధానాలపై కూడా పలు రచనలు చేశాడు.

అమెరికా డెమొక్రటిక్ పార్టీకి పథనిర్దేశం చేయటంలోను, ఆ పార్టీ నాయకుల ఆలోచనలను ప్రభావితం చేయటంలోను గాల్‌బ్రెత్‌ది కీలకపాత్ర. 1952, 1956 కాలంలో డెమొక్రటిక్ పార్టీ తరపున అమెరికా అధ్యక్షునిగా పోటీచేసిన అడ్లాయి ఇ.స్టీవెన్‌సన్‌కు గాల్‌బ్రెత్ కీన్స్ ఎకనామిక్స్ సిద్ధాంతాలను పరిచయం చేశాడు. అయితే డెమొక్రటిక్ పార్టీకి ఎంత సన్నిహితంగా ఉన్నప్పటికీ ఆయన తన అభిప్రాయాల విషయంలో రాజీధోరణిని చూపలేదు. ఈ కారణం చేతనే అమెరికా అధ్యక్షుడు లిండన్ బి.జాన్సన్‌తో వియత్నాం యుద్ధవ్యవహారంలో తెగతెంపులు చేసుకున్నాడు.

1996 నవంబరులో అమెరికా స్టాక్ ఎక్స్ఛేంజి డౌజోన్స్ 6,500 పాయింట్లను దాటడం గురించి మాట్లాడుతూ గాల్‌బ్రెత్ ఇలా అన్నాడు - "దానిని తెలివిగా నిర్వహించగలిగిన దానికంటే చాలా ఎక్కువస్థాయిలో డబ్బు చలామణీ అవుతోంది. ఇది నిలకడైనది కాదు." ఈ వాక్యం 2001వ సంవత్సరపు అమెరికా స్టాక్ ఎక్స్ఛేంజి పతనంతో అక్షరసత్యమని రుజువయ్యింది. 1980వ దశకంలో రోనాల్డ్ రీగన్ అమెరికా అధ్యక్షునిగా ఉన్న కాలంలో గాల్‌బ్రెత్ ఆయన ఆర్థిక విధానాలను తీవ్రంగా విమర్శించాడు. 2000 సంవత్సరంలో క్లింటన్ అమెరికా అధ్యక్షునిగా ఉండగా గాల్‌బ్రెత్‌కు మరలా రెండవసారి 'మెడల్ ఆఫ్ ఫ్రీడం' పురస్కారం లభించింది.

**"ఆకలిగొన్నవారికి ఆహారం గురించిన ప్రకటనా, చలిలో వణుకుతున్న వారికి ఇంధనం గురించిన ప్రకటనా, లేదా నిలువనీడ లేనివారికి ఇంటి గురించిన ప్రకటనా అవసరంలేదు"**

**- జాన్‌కెన్నెత్ గాల్‌బ్రెత్**

❑

# మార్క్సిస్టు మనోవికాసం - నేటి అవసరం

**ఇతిహాస్**

## పుస్తక పరిచయం

ఇప్పుడు తెలుగులో అత్యధికంగా అమ్ముడవుతున్న సాహిత్యం 'వ్యక్తిత్వ వికాసానికి' సంబంధించింది. అందుకే 'పాపులర్' రచయితలంతా ఇటీవలికాలంలో విజయానికి నిచ్చెనలు వేసే పుస్తకాలు తెగ రాసేస్తున్నారు. అవి హాట్‌కేకుల్లా అమ్ముడవుతున్నాయి.

సంపూర్ణ పురుషుడిగా లేదా స్త్రీగా రూపాంతరం చెందేందుకు అన్యోన్య దాంపత్యానికి, అందంగా, ఆకర్షణీయంగా కనిపించడానికి, స్నేహితులను పొందడానికి, డబ్బు, కీర్తి సంపాదించడానికి - ఇలా రకరకాల 'విజయాలు' సాధించడానికి చిట్కాలు చెప్పే పుస్తకాలనేకం మార్కెట్లో లభ్యమవుతున్నాయి నేడు.

మరి పాపారావుగారు రాసిన 'మార్క్సిస్టు మనోవికాసం' వీటికన్నా ఏ విధంగా భిన్నమైనది? రచయిత మాటల్లోనే చూస్తే - 'కనురెప్ప పాటులో ధనవంతులైపోయి, తక్షణమే వియజసోపానాలను అధిగమించాలని తాపత్రయపడుతున్న లెక్కకు మించిన యువతీ యువకులు నేటి సమాజపు లక్షణం. కాగా, ఇటువంటి యువతీ యువకులు మెజారిటీ వాస్తవానికి తమ ఆశలు అడియాసలు కావటం అనతికాలంలోనే గుర్తిస్తున్నారు. కాబట్టి ప్రస్తుతం మార్కెట్‌లో ఉన్న ఏకపక్ష, వ్యక్తిగత వికాస సాహిత్యానికి ప్రతిగా ఈ యువతీ యువకుల ఆశలను, ఆకాంక్షలను నిజమైన శాస్త్రీయ పునాదిపై నిలిపి వారికి పోరాటబాటలో నూతన వ్యక్తిత్వాలను సంతరించుకునే మార్గాన్ని చూపగలగటమే ఈ పుస్తకం ఉద్దేశ్యం.

కమ్యూనిస్టులకు అధ్యయనం యొక్క ఆవశ్యకత వివరిస్తూ ఇవ్వాళ పత్రికలు వార్తల పేరిట చలామణి చేస్తున్న రాతలు ఎవరి ప్రయోజనాలను నేరవేరుస్తున్నాయో తెలుసుకోవాలని రచయిత చెప్తారు.

కమ్యూనిస్టు అనే వాడు మూడురంగాలలో పోరాటం చేయవలసిన అవసరం ఉందని అంటాడు రచయిత. అది వెలుపలి బూర్జువా శత్రువులతో పోరాటం, ఆంతరంగికంగా ఇతర కామ్రేడ్‌లలో ఉన్న బూర్జువా లక్షణాలతో పోరాటం, తనలో తానే ఎదుగుదలకై అంతరోన్ముఖుడై సాగించే పోరాటం.

అలాగే యువత కేవలం ఆవేశంతో ముందుకుపోవడం కాకుండా అధ్యయనం - ఆచరణ - దిద్దుబాటు మరలా దిద్దుబాటు, అధ్యయనం - దిద్దుబాటు - ఆచరణల ద్వారా మార్క్సిస్టు సిద్ధాంతాన్నిఏ ఆకళింపు చేసుకోవాలని రచయిత సూచిస్తున్నాడు.

ఎంతోకాలంగా కమ్యూనిస్టు కార్యకర్తలకు శిక్షణ ఇస్తున్న డి.పాపారావు గారు తన అనుభవాలను, శాస్త్ర పరిజ్ఞానాన్ని మేళవించి ఈ పుస్తకం రాశారు. మార్క్సిస్టు మనోవికాస బోధనలు సులభంగా అర్థమయ్యే ఉదాహరణలు వాడడం ద్వారా పాఠకునికి తేలికగా అర్థం అయ్యేలా చేయడంలో రచయిత కృతకృత్యుడయ్యాడనే చెప్పాలి. ❑

**మార్క్సిస్టు మనోవికాసం - డి.పాపారావు, ప్రచురణ - చైతన్య పబ్లికేషన్స్, వెల- రు.15, ప్రతులకు - అన్ని ప్రముఖ పుస్తకాల షాపులు**




# ఆంధ్రప్రదేశ్ : నాడు - నేడు

### ఎంపిక చేసిన కొన్ని పరిశ్రమల పారిశ్రామిక ఉత్పత్తులు

| పరిశ్రమ | ప్రమాణాలు | 1960 | 2004 |
|---|---|---|---|
| నూలుదారం | లక్షల కేజీలు | 172.67 | 848.34 |
| జనపనార | టన్నులు | 31,868 | 32,384 |
| సిమెంట్ | టన్నులు | 7,18,689 | 1,12,58,655 |
| కాగితం | టన్నులు | 35,506 | 3,10,927 |
| చక్కెర | టన్నులు | 1,32,773 | 6,62,406 |
| సిగరెట్లు | మిలియన్లు | 6819 | 8,546 |
| బొగ్గు | వందల టన్నులు | 2531 | 34,283 |

### పరిశ్రమల సంఖ్య - ఉద్యోగుల సంఖ్యలో పెరుగుదల

| సంవత్సరం | పరిశ్రమల సంఖ్య | ఉద్యోగుల సంఖ్య (లక్షలలో) |
|---|---|---|
| 1956 | 3754 | 0.28 |
| 1961 | 3160 | 1.42 |
| 1970-71 | 7096 | 3.25 |
| 1980-81 | 15939 | 6.89 |
| 1982-83 | 16927 | 7.85 |
| 1990-91 | 19881 | 8.36 |
| 2000-01 | 14029 | 9.07 |
| 2001-02 | 14237 | 8.98 |
| 2002-03 | 14683 | 10.08 |

### ఆంధ్రప్రదేశ్ స్థూల ఉత్పత్తిలో పారిశ్రామికరంగం వాటా

(1993 - 94 స్థిర ధరల ప్రకారం)

(రు. కోట్లలో)

| సంవత్సరం | గనులు తవ్వకాలు | ద్వితీయరంగం | మొత్తం పారిశ్రామికరంగం | మొత్తం స్థూల ఉత్పత్తి |
|---|---|---|---|---|
| 1960-61 | 170.98 | 1,721.94 | 1,892.92 | 14,984.1 |
| 1970-71 | 300.72 | 28.52.5 | 31.53.22 | 20,225.42 |
| 1980-81 | 540.5 | 4,816.19 | 5,356.69 | 28,189.09 |
| 1982-83 | 593.55 | 5,746.36 | 6,339.91 | 32,825.74 |
| 1988-89 | 896.85 | 8,255.67 | 9,152.52 | 44,933.37 |
| 1989-90 | 881.61 | 8,962.65 | 9,844.26 | 48,043.38 |
| 1994-95 | 1,376.76 | 14,406.39 | 15,783.15 | 61,113.77 |
| 1995-96 | 1,464.52 | 15,240.51 | 16,705.03 | 64,728.71 |
| 2003-04 | 3,114.79 | 23,181.33 | 26,296.12 | 99,931.1 |
| 2004-05 | 3,320.37 | 24,652.13 | 27.972.5 | 1,05,672.95 |

మూలం : డైరెక్టరేట్ ఆఫ్ ఎకనమిక్స్ అండ్ స్టాటిస్టిక్స్, గవర్నమెంట్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్, హైదరాబాద్

